# నదీనదాలు

(నవల)

రచయిత

బి. నాదమునిరాజు




విద్యోదయా పబ్లికేషన్స్

కడప

# మొదటి ప్రకరణము

ఒడిసి ఒడిసీ కొడుతూన్న ఈదరగాలి. జడిసి పెట్టి కసిగా కురుస్తున్న వాన తుంపరలు. చలి...విపరీతమైన చలి. ఎముకలు కొరికేసే చలి. కండలు చివికేసే పాడు చలి! గుండెలు తీసి గుప్పెట్లో దాచుకున్నా ఆగని చలిబాధ అంతరాంతరాల్లో అలుముకుపోతోంది. ఝుంయ్‌మని ఒకటే హోరు. రైలుబండికి యీ ధ్యాసే లేదు. గుండెల్లో మండుతూండే రాక్షసి బొగ్గు ఆసరాగా ఆదుకుంటూందేమో! నిర్లక్ష్యంగా ఖాతరు చేయకుండా ఛాతీ విరచుకొని పరుగిడుతోంది. రైలు పరుగిడుతూవుంటే వుద్భవించే "ఘప్ ఘప్" ధ్వనులు చలితో వణుకుతూండే మానవుల్ని వెక్కిరించినట్లున్నాయి.

జడివానలో తడసి వచ్చిన బురద కాళ్ళతో రొచ్చు రొచ్చుగా తయారైన రైలుపెట్టె, మెరిసే తగరం చాటున పరదాలో స్త్రీ మాదిరి సౌకుమార్యంగా వుండి, బజారుపాలై జీవితం పోగొట్టుకున్న సిగరెట్ పీకల కుప్పలు, బీడీ తుంటలు, కేకరించి వూసిన వుమ్మి కుప్పలు, అరటి తొక్కలూ...అబ్బ! నానా కంగాళిగా వుంది ఆ మూడవ తరగతి రైలుపెట్టె! మూడవ తరగతి! థర్డ్ క్లాస్! హిందూదేశంలో రైళ్ళను సృష్టించిన మహానుభావులకి యెలాంటి వూహ తట్టింది! మూడవ తరగతి సృష్టి బ్రహ్మాండంగా వుంది. ఆ కక్ష్యలో ప్రయాణించే మానవులకి అనుగుణంగానే వుంది ఆ పేరు! అంత యదార్థమైన పేరు పెట్టినవార్ని అభినందించకుండా

వుండటం కష్టమైన విషయం. ఇండియాలోని మూడవ తరగతి రైలుపెట్టెలు నరకానికి పొలిమేరలన్నాడట యెవరో విదేశీ ప్రయాణీకుడు. వాస్తవాన్నే కళాత్మకంగా అన్న పేరు తెలియని ఆ మహానుభావుడు యింకా బ్రతికేవుంటే చిరకాలం వర్ధిల్లుగాక!

"అబ్బ!... వెధవ వాతావరణం..." అప్పుడే ముగిసిందేనని కాబోలు చుట్టముక్కవైపు కసిగా చూచి విసిరికొడ్తూ అన్నాడు స్వగతంగా ఒక ప్రయాణీకుడు.

"కాకపోతే యేవిటండీ! వర్షమో అని అల్లాడేటప్పుడు చినుకుకూడ కురిసి చావదు. అవసరం లేనప్పుడు పండిన నాల్గు గింజలు కుళ్ళబెట్టేందుకే యిదంతా" అన్నాడు ప్రక్కనే దుప్పటి ముసుగులో ముడుచుక కూర్చున్న ఒక రైతు.

తలుపుకటు వేపున్న కార్నర్ సీటులో ముడుచుక కూర్చున్న సూర్యనారాయణ చుట్ట విసిరేశిన పెద్దమనిషివైపు పరిశీలనగా చూచాడు. గంభీరమైన ఆకారం - దట్టమైన కనుబొమలు, చిన్నగా వొంపుతిరిగిన మీసాలు, నిశితమైన చూపులు, లోకానుభవాన్ని చాటే నుదురు, నల్లటి క్రాపులో అక్కడక్కడ తెల్లబడ్డ వెండ్రుకలు - అవి అంద వికారంగా కనుపించకుండా ఆ మనిషికి మరింత శోభ తెచ్చేవిలా కనుపిస్తున్నవి. తెల్లని పొందూరు ఖద్దరు బట్టలతో యిట్టే ఆకర్షిస్తారాయన.

ఆయన పెద్దగా ఆవలించి చిటుక వేశారు. ఏమీ మాట్లాడకుండా వూరికే కూర్చోవటం ఆయన ప్రవృత్తికి

విరుద్ధంగా వున్నట్లుంది. పెట్టెలోని జనం వైపు యెగా దిగా చూశారు. ఆయన దృష్టి సూర్యనారాయణపై నిలిచింది. రెండు మూడు క్షణాలు ఆ పడ్డదృష్టి అలాగే నిలిచింది. ఆయన వైపే చూస్తున్న యువకుడు ఆయనా తన వైపు చూడటంతో కనురెప్పలు వంచి నేల చూపులు చూస్తూ కూర్చున్నాడు.

"ఎందాకా? అబ్బాయ్!-నిన్నే!" ప్రశ్నించారాయన.

సూర్యనారాయణ తలెత్తి చూశాడు. "బెజవాడ కండీ!" ముక్తసరిగా జవాబిచ్చాడు.

"అయితే యీ వందమైళ్ళు నాతోటే వుంటావన్న మాట!" ఆయన చిన్నగా నవ్వారు.

"మీరు......" సూర్యనారాయణకూడ యేదో ప్రశ్నించబోయాడు. కాని మధ్యలోనే ఆయన "మాది బెజ వాడే నబ్బాయ్! ఏదో కొద్దిగా పనుండి కర్నూలువరకు వెళ్లి వస్తున్నా" అన్నారు.

మాది బెజవాడ - కర్నూల్ వరకు వెళ్లివస్తున్నాను - ఆ రెండు మాటలు విన్న సూర్యనారాయణ మనసెందుకో కొద్దిగా వికసించింది. 'ఈలాంటివారి సహాయం లభి  అని అనుకున్నాడు. మనసులోనే అలా అనుకుంటూ ఒక చిన్న వ్యూహచిత్రాన్ని తన కళ్ళముందు సృష్టించుకోబోతోంటే, అంతలోనె "నీ పేరేమిటన్నావ్ అబ్బాయ్!" ఆయన ప్రశ్న ఎక్కడ్నో గాలిలోంచి వినిపించినట్లయింది సూర్యనారాయణకు.

పేరుతోబాటే సూర్యనారాయణకు సంబంధించిన అన్ని సంగతులు తెలుసుకున్నారా పెద్దమనిషి.

"అబ్బ! పాడుకాలం యిది! మేం మీ వయసులో వున్నరోజుల్లో..." కొద్దిగా చప్పరిస్తూ, "థర్డ్‌ఫారం చదివి తాలూకాఫీసులో గుమస్తాచేసి తాశీల్‌దార్లయిన వారెం దర్నో యెరుగుదును నేను. ఇప్పుడు పేరుకు డిగ్రీలేగాని యెందుకూ కొరగావబ్బాయ్! వున్న కొద్ది పాటిని చదువులకు పాడుచేసుకొని సతమత మవ్వటమేగాని..." ఆగారాయన. జోబులోనుంచి పొగాకు కాడ తీసి చుట్ట చుట్టుకుంటూ "సూర్యం! ఏలాంటి వుద్యోగం కావాలి నీకు?" ప్రశ్నించారు.

ఆయన ప్రశ్నకు సూర్యనారాయణ విస్తుపోయాడు.

ఆయనతో మాటలు మొదలైనప్పటినుంచి తన ఉద్యోగ విషయంలో యేలా ఆయన సహాయాన్ని అర్థించ టమా అని ఆలోచిస్తున్న సూర్యానికి ఆయనే అలాంటి ప్రశ్న వేయటం వెదుకబోయిన తీగ కాళ్ళకు చుట్టుకున్నట్లయింది.

పెల్లుబికే ఆనందాన్ని, కృతజ్ఞతను ఆపుకుంటూ "ఉద్యోగమంటూ యేదో ఒకటి - అదేదైనా కావచ్చు. దొరకటమే గదండీ కావలసింది!" అన్నాడు వినయంగా.

ఆయన ఒక చిరునవ్వు నవ్వారు.

సూర్యం చేతులు పిసుక్కుంటూ, దొరికిన అవకాశాన్ని జారవిడువకూడదనే దృష్టితో "మీలాంటి వారనుకుంటే - ఏదో ఒకటి..." అనుకొని అవకాశం దొరికిందనే ఆవేశ ఆనందాల్ని అణచుకుంటూ అతడు యేదో నంగి నంగిగా మాట్లాడాడు. కాని చెప్పదలచింది చెప్పలేకపోయాడు.

చెప్పిందేదో అతని హృదయంలో ఉన్న భావాన్ని వ్యక్తం చేయలేకపోయింది.

అనుభవజ్ఞుడైన ఆ పెద్ద మనిషి జీవిత పోరాటంతో అప్పుడప్పుడే తల పడుతున్న యువకునిలోని గాభరాను, అతని మాటల్లోని తికమకని చూచి మనసులోనే చిన్నగా నవ్వు కున్నారు; తృప్తిగా నవ్వుకున్నారు కూడ. తను వ్యక్తం చేయవలసిందంతా చెప్పినాననే అనుకుంటూ జవాబుకోసం ఆయన ముఖానికేసి కాచుక కూర్చున్నాడు సూర్యనారాయణ.

"నీవేం భయపడమాక! అన్నీ నేను చూచుకుంటాగా" అన్నా రాయన సూర్యంవైపు మరో మాటు పరిశీలనగా చూస్తూ.

ఆత్మ విశ్వాసం సంపూర్ణిగా వున్నా, మసక మసకగా కనుపించే ముందు రాగలవనే చిక్కులకు భీతిల్లుతూ, భవిష్య త్తును మాత్రం కమనీయంగా వూహించుకుంటూ దూరప్రాం తాలకి యే పలుకుబడీ వెంటలేకున్నా ప్రయాణంచేసే యువ కుడి నేత్రాలు ఆయన హామీతో, కృతజ్ఞతతో సజలము లైనాయి. మాటలతో కృతజ్ఞతాభావాన్ని వెలువరించ లేకున్నా ఆ రెండు కళ్లు తను విద్యుక్తధర్మాన్ని చక్కగా నిర్వర్తించాయి.

పచ్చగా పెరిగి ఒరుగుతూన్న జొన్న మొక్కలమీద పడ్డ నీళ్ళు మిలమిలా మెరిసిపోతున్నాయి. వెడల్పాటి ఆ మొక్కల ఆకులమీద మెరిసే ఆ నీటి బిందువులు అలసిన అందమైన స్త్రీ నుదుటిమీది స్వేద బిందువుల్ని గుర్తుకు తెస్తు

న్నాయి. పచ్చటి పొలాలు, యెత్తైన మట్టి కుప్పలు, బండ రాళ్ళు రైలు పరుగిడుతూంటే అవికూడ పందెంవేసి పరుగు తీస్తున్నట్లు అవుపిస్తున్నవి. కిటికీలోనుంచి బయటకు చూస్తూ సూర్యనారాయణ, వూహించని తన అదృష్టానికి పొంగి పోతున్నాడు.

పచ్చ కళ్ళద్దాలు పెట్టుకున్న వాడికి ప్రపంచమంతా పచ్చగా కనుపిస్తుంది. ఆలానె మనుష్యుని మనస్తత్వాన్నిబట్టే ప్రకృతి శోభ వాడికవగతమవుతుంది. దుఃఖితునికి ప్రపంచ మంతా శోకతప్తమై శోభారహితంగా అవుపిస్తుంది. చంద్ర బింబంలాంటి యువతుల ముఖాలు వెలవెలా పోతూన్నట్లు వూహించుకుంటాడు. అందమైన గులాబీపూలలోని ముళ్ళే అతని దృష్టిన బడుతవిగాని పూలశోభని గురించి ఆలోచిం చడు; వూహించడు. ఆలాగే వుల్లాసంతో వుప్పొంగిపోయే వాడికి జగత్తంతా సౌందర్య విలసితంగా అలరారుతూ వున్న ట్లుంటుంది. ప్రకృతి మాత కోపంతో విసరివేసినట్లుండే బండ రాళ్లలోకూడ అతనికి శిల్పకళ అవుపిస్తుంది. వాటి తీరు తెన్నుల్నిబట్టి వాటికో ఆకారాన్ని రూపకల్పన చేసుకుంటాడు. అంతా ఆనందమే, మహదానందమే వాడి దృష్టి కవుపించేది. మానవ జగత్తులో సర్వేసర్వత్రా వ్యాపించియున్న ప్రాథ మిక సత్యమిది! అందుకే సూర్యనారాయణకు ప్రకృతంతా యెంతో శోభాయమానంగా వెలుగులు విరజిమ్ముతున్నట్లవు పిస్తోంది. గూళ్లకువెళ్ళే పక్షుల కిలకిలారావాలు శ్రావ్యంగా

వినిపిస్తున్నాయి. లకుముకి పిట్టల 'టక టక' ధ్వనులు ఆ రాగానికి లయ తప్పకుండా తాళం వేస్తున్నట్లున్నాయి.

చుట్టదమ్ము గట్టిగా లాగుతూ ఆలోచనల కొనసాగిస్తూన్నారాయన. 'పర్వాలేదు. పర్వాలేదేం? ఎంతో బావుంది. ఇన్నిరోజులు నా వూహల్లో మెదలాడిన అబ్బాయి యిలాంటివాడే; కులస్థుడు – బుద్ధిమంతుడిలానె అవుపిస్తున్నాడు. అమాయకమైన ఆ చూపులు, భావాల్ని భాషలో పెట్టలేని ముగ్ధత్వమూ – అన్నీ బావున్నాయి. అయినా ఇంకా చూడవచ్చుగా...' మనసులో తనలోతాను మాట్లాడుకుంటున్నట్లనుకున్నారాయన.

పొద్దు గూకింది. పెట్టెలో లైట్లు వెలిగాయి. ఆకాశంలో అలుముకున్న మేఘాలు కొండల చాటుకి ప్రయాణం సాగిస్తున్నాయి. మూడు నాలుగు నాళ్ళనుండి జలధారాల ప్రతిబంధకంతో కనుపించని అష్టమినాటి చంద్రుడు క్రొత్త పెళ్లికొడుకులా చిరునవ్వుల్లాంటి వెన్నెలలు పెదజిమ్ముతున్నాడు. పెట్టెలో జనం వత్తిడి తగ్గిపోయింది. మన ప్రయాణికు లిద్దరూగాక మరో నలుగురైదుగురుమాత్రమే వున్నారు. లైటు క్రిందనే సీటుమీద చొంగ కారుస్తూ గాఢ నిద్రలో పడి గుర్రులు తీస్తున్నాడు ఒక పల్లెటూరి రైతు. బట్టల సంచి భుజానికి తగిలించుకొని దాన్నే తలగడగా పెట్టుకున్నాడతను. ప్రయాణంలో దొంగలు సంచి కొట్టేస్తారేమోనని భయంతో అంత జాగ్రత్త తీసుకున్న అతగాడు వంటిమీద స్మారకం లేకుండా పడుకొని వుండటం చూచి సూర్యాం

తనలోతానే నవ్వుకున్నాడు. పెరిగిన గడ్డం, చిరిగిన బట్టలతో మరోవాడు క్రింద మూలగా కూర్చుని బీడీ కాలుస్తున్నాడు. టికెట్టులేని ప్రయాణికుడేమో - అతని చూపుల్లో భయం - గడ్డకట్టుకున్న భయం తాండవిస్తోంది. మరోవాడు వేళ్లు లెక్క బెట్టుకుంటూ తనలోతానే యేదో గొణుక్కుంటున్నాడు. ప్రక్కనుండే బుట్ట అతడు చిల్లర వ్యాపారస్థుడని మనకు పరిచయం చేస్తున్నట్లుంది. మరో నలభై యేళ్ళావిడ కూర్చునే కళ్లు మూస్తూ తెరుస్తూ వుంది.

నారాయణరావుగారు చుట్ట విసిరేశారు. పరచిన హోల్డాల్‌కు తలవేపున్న లెదర్ బాక్స్ తెరచి రెండు రొట్టెలు, నాలుగు బత్తాయి పళ్లు తీశారు. రావుగారు బ్రెడ్, పళ్లు తీస్తూవుండటం గమనించిన సూర్యం ముఖం ప్రక్కకు తిప్పు కొని వెన్నెల్లోకి చూస్తూ కూర్చున్నాడు. వెన్నెల్లో ప్రకృతి కురులార్చుకుంటున్న సౌందర్య దేవతలా మరింత అందంగా కనుపిస్తోంది.

"సూర్యం..." రావుగారు పిలిచారు. అలా పిలుస్తూనే ఒక రొట్టె, రెండు పళ్ళు అతనికి అందీయబోయారు.

"వద్దండి! కడుపు నిండుగా వుంది. ఆకలివేయటం లేదు" అన్నాడు సూర్యం వాటి నందుకోకుండానే.

"పర్వాలేదులే" అన్నారాయన.

సూర్యం యేమో నసగబోయాడు. కాని ఆయన "రాళ్ళు తిని అరిగించుకోవలసిన ప్రాయం! ఇంద. సిగ్గుపడ మాక!" ఎన్నో రోజులుగా పరిచయ మున్నవారిలా, తండ్రిలాంటివాడు బిడ్డని ప్రేమతో అన్నట్లు అంటూంటే సూర్యం

మరేమీ బదులు చెప్పలేక వాటిని తీసుకున్నాడు. ఆయన మాటలు వింటూంటే పదేళ్లనాడు మరణించిన తన తండ్రి గుర్తుకొచ్చాడు సూర్యానికి. ఆనందకరమైన ఆ సమయంలో ఆ వూహా రావటంతోనే అనుకోకుండానే అతని కళ్లలో నీరు గిర్రున తిరిగింది. రావుగారు చూస్తారేమోననే భయంతో ముఖమటువైపుకు త్రిప్పుకున్నాడు సూర్యనారాయణ.

ఫ్లాస్కులోనుంచి వేడి 'టీ' తను త్రాగి సూర్యానికి యిచ్చారాయన. వద్దంటూనే సూర్యం పుచ్చుకున్నాడు. తర్వాత యేవో రెండు మాటలు మాట్లాడి ఆయన పడుకొని నిద్రకు తలపడ్డారు. సూర్యనారాయణ మాత్రం రాత్రంతా కన్ను మూయకుండా జాగారం చేశాడు. నిద్రపోవాలని యెంతో ప్రయత్నించినా వీలయిందిగాదు. పున్నమి వెన్నెల్లో వుప్పొంగిపోయే వుదధిలా అతని హృదయపుటంచుల్ని ఒరుసుకుంటూ యేవేవో భావాలు వుప్పొంగి పోతోంటే ఆలానే కళ్లార్చుకుంటూనే గడిపాడు. చీకటి తెరలు చీల్చుకుంటూ వుషఃకాంతులవతరించాయి. తూరుపు కొండచాటున అరుణోదయంతో పాటే ట్రెయిన్ విజయవాడ ప్లాటుఫారంమీద ఆగింది.

## రెండవ ప్రకరణము

---

"ఇంట్లో బియ్యం నిండుకున్నవి."

"..............."

"పిల్లాడి పాలల్లోకి పంచదారకూడ లేదు."

"..............."

"ఏమండీ! పలుకరేం? మిమ్మల్నే!"

చాపమీద కూర్చుని గోడ కానుకొని మోకాళ్ళమీద పుస్తకం పెట్టి వ్రాసుకుంటున్న రాజారావు తలెత్తి చూశాడు. కమ్మని కల కంటున్న వాడిని యెవరో తట్టి లేపుతే వాడి ముఖంలో కనుపించే చీకాకు అతని ముఖంలో ప్రస్ఫుటంగా కనుపించింది.

"ఇద్దరు బిడ్డల తండ్రయినా సంసారంమీద, సంపాదన మీద శ్రద్ధలేని మనిషి యెవరైనా వుంటారా?" కమలమ్మ తనలో తాను ప్రశ్నించుకున్నట్లుంది. కాని ఆ మాటలు బయటకు వెలువడ్డాయి. రంగు వెలసిన నేత చీర, అసంతృప్తికి ఆలవాలమైన కళ్ళు – బంగారు చాయే అయినా పాలిపోయినట్లువుపించే ముఖమూ – ఏణ్ణర్ధం బిడ్డను చంకన వేసుకొని రాజారావు వ్రాసుకుంటున్న గదిలోకి వచ్చి నిలబడింది కమలమ్మ.

రాజారావు వ్రాసే పుస్తకాన్ని తీసి తలుపుల్లేని గోడ అల్‌మేరాలో వుంచేశాడు. అదే అల్‌మేరాలోనే పై వరుసలో వున్న అద్దం, దువ్వెన తీసుకున్నాడు. తన మొహాన్ని అద్దంలో చూచుకున్నాడు. అతని పెదవుల్నుండి చిన్న దరహాసమొకటి వెలువడింది. ఆ చిరునవ్వు వెనుక రసవత్తరమైన ఘట్టాలుకాని, మధుర మధురములైన భావనలుకాని యేమీ లేనట్లున్నవి. ఆ చిరునవ్వులో వున్నదొకటే. అది శూన్యత్వము! ఏడ్పులేక నవ్వువారు కొందరు. అదే – అవును–అదే–

నవ్వని పిలువబడే యేదుపే ఆ చిరు దరహాసంలో వుంది. రాజారావు వయసు ముప్ఫయ్యేళ్లు. చామన చాయ. కొనదేరిన నాసికాగ్రము. దూరతీరాల్లో వేటినో వెదుకుతూన్నట్లుండే కళ్ళు. బక్కపలుచగా వుంటాడు. అతన్ని చూచిన వాళ్ళని యిట్టే ఆకర్షించేవి ఆ కళ్లు మాత్రమే! మనిషి నిస్సారంగా వున్నా ఆ కళ్లలో ఆశ మిల మిలా మెరుస్తూ వుంటుంది. భవిష్యత్తుమీద ప్రగాఢ విశ్వాసము, చిందులు త్రొక్కినట్లుండే విజ్ఞాన తేజఃపుంజాలు ఆ కళ్లలో తళుకు లీనుతూ వుంటాయి.

చిన్న హాలు, ఒక వంటగది, మరో చిన్నగది - యివే ఆ యింట్లో వుండేది. ఆ చిన్నగదిలో రకరకాలైన పుస్తకాలు ఒక అల్మేరానిండా అందంగా అమర్చబడి వున్నాయి. బోసినోటితో చిరునవ్వులు చిందించే గాంధీతాత, తలపాగాతో వివేక విజ్ఞానాలను మూర్తీభవించినట్లుండే గంభీరమైన వివేకానందుడు, చిన్నిగడ్డంతో తేజోవంతమైన కళ్ళతో నూతన జీవిత విధానాన్ని సృష్టించిన లెనిన్, రవీంద్ర కవీంద్రుడు-వీరివి ఆ గదిలోనున్న ఫోటోలు. డ్రాయింగ్ రూమ్‌గా వుపయోగించుకుంటున్న ఆ గదిలో ఒక్క కుర్చీ కూడ లేదు. రెండు చాపలు పరచి వున్నాయి.

రాజారావు కమలమ్మ చంకనున్న బిడ్డడి చెక్కిలిపై చిటుకవేస్తూ "అహల్య యెక్కడ?" ప్రశ్నించాడు.

"ఆ నీటిపంపు దగ్గర ఒకే మంద - నీళ్ళతోనే ఒక మనిషికి సరిపోతుంది," అంది కమలమ్మ.

"అయిదు రోజులయింది ఆయన కర్నూల్ కి వెళ్ళి. రాత్రే వస్తాడనుకున్నాం. ఏడీ? రాలేదు – ఏలానో!" బయల దేరబోతూ రాజారావు స్వగతంలోనే అనుకున్నట్టు చిన్నగా అన్నాడు.

"కొంచం త్వరగా తెమిలి రండి, ఎక్కడికెళితే అక్కడే తిష్ట వేసుకూర్చుని మాటలు పెట్టుకోకుండా!" కమలమ్మ ప్రయత్నపూర్వకంగా అంటూ విసురుగా వంటగదిలోకి నడిచింది.

రాజారావు రోడ్డునబడి నడుస్తున్నాడు. ఇంట్లో ఏమీ లేకపోవటమూ, సతీమణి చిరబురలాడటము–యివన్నీ అతణ్ణి ఏమీ కలతపెట్టలేదు. మనిషి ప్రశాంతంగా వున్నాడు. ఏదైనా – అది సంతోషమైనా, దుఃఖమైనా నూతనంలో వింతగా వుంటుంది. కాని అలవాటయిన తర్వాత అది మనుష్యుణ్ణంతగా బాధపెట్టదు. సుఖంగా జీవించేవాడికి అకస్మాత్తుగా దారిద్ర్యము ప్రత్యక్షమైతే క్రొత్తలో క్రుంగిపోతాడు. చేతులు కాలినవాడిలా విల విలలాడుతాడు. కాని, క్రమేణా ఆ జీవితానికి బాగా అలవాటుపడతాడు. ఒక విధంగా చూస్తే మానవ జీవితమంతా అలవాట్లమయమే! పరిస్థితుల కనుగుణంగా మానవుడు తన అలవాట్లను మార్చుకోకపోతే ప్రపంచంలో యింత నాగరికత అభివృద్ధి అయివుండేది కాదు కూడానేమో!

రాజారావు నడుస్తున్నాడు. అతని వ్రేళ్లమధ్య సిగరెట్ దానంతటదే కాలిపోతూ హరించుకపోతోంది. అతని ఆలోచనలు యెక్కడెక్కడో పయనిస్తున్నాయి. అతను కళా

కారుడు. రచయిత. అతి సున్నితమైన హృదయమతనిది. 'మంచి' నెంతగా ప్రేమిస్తాడో 'చెడు'ను అంతగా ద్వేషిస్తాడు. అనుక్షణం అతనిలో యేవేవో భావాలు మంచి నీటి చెలమలో నీళ్లలా స్వచ్ఛంగా పొంగుతూ వుంటాయి. వ్యక్తిగతమైన అతని కష్టసుఖాలు, అతనిలోని భావనా ప్రవాహాల్ని ఆపలేవు. గంగా ప్రవాహం అలలతో ఒడ్డుల్ని ఒరుసుకుంటూ మహావేగంగా ప్రవహిస్తుంది. మరొహప్పుడు క్రొత్తపెళ్లి కూతురిలా మెల్లగా కన్నుల పండువుగా కదుల్తూ వుంటుంది. కాని, యేనాడు యింకిపోదు. ఆలాగే అతనూ. తన యింట్లో పిల్లాడికి పాలలోకి పంచదార లేకుంటే – మరో గుడిశలో బ్రతికే పిల్లాడి గంజిలోకి వుప్పు లేంది అతను వూహించగలడు. ప్రపంచం నందన వనంగా మారాలని, మానవులంతా దేవతలవ్వాలని అతను కలలు కంటాడు. అతని ప్రపంచానికి యెల్లలు లేవు. జాతి మత రంగు విభేదాలు లేవు. గాలి గిలగిల కొట్టుకునే యెండుటాకులాంటి హృదయ మతనిది!

కాని...ఆలాంటివారు లోకం దృష్టిలో పిచ్చివాళ్లు. అసమర్థులు – ఏమీ చాతగాని వాళ్లు. ఆశయాలంటూ లేకుండా అందరిలో ఒకరై చిన్నచిన్న విషయాలకే ఆవేశకావేషాలు పెంచుకుంటూ, స్వార్థంకోసం లోభ ప్రలోభాలకు గురవుతూ ద్వేషము, పగ, క్రోధము – అంతలోనె ఆనందం– మరి కొంతసేపట్లోనే దుఃఖమూ అనుభవిస్తూ, తమచుట్టూ చిన్న ప్రపంచాన్ని సృష్టించుకొనేవాళ్లు లోకం దృష్టిలో పూజనీయులు; బ్రతుక నేర్చినవారు. ఆ చిన్న ప్రపంచంలో మోసాలు, కుహకాలు, కుట్రలు పిలుస్తె పలుకుతూ

వుంటాయి. దగా దోపిడీలు యెప్పుడూ తారట్లాడుతూనే వుంటాయి. గానుగెద్దుల జీవితాలకి వీరి జీవితాలకి భేదమేమీ లేదు. ఆశయాలు లేని వారికి ఆలోచనలుండవు. ఆలోచనలు లేకపోతే మానవత్వం వికసించదు. జీలకర్రలో కర్ర లేనట్లే మానవుల్లో మానవత్వం కరువయి పోతోంది. అందుకే యుద్ధాలు – సంక్షోభాలు – కాటకాలు, కరువులూను.

మానవ జీవితంలో యౌవన దశ ఒక వరప్రసాదం లాంటిది. ఆ దశలో వుండే వుత్సాహము, వుద్రేకమూ మరే దశలోను వుండవు. బుద్ధి బలానికి, విద్యకు, హృదయానికి సంబంధించక వొకసారి పోగొట్టుకుంటే మరెన్నడు తిరిగి రానట్టి ఒక వింత ఆతృతకి సంబంధించింది యువశక్తి. తన జీవితాన్ని సమాజాని కనుగుణంగా దిద్దుకపోవటానికి, లేదా లోకాన్ని తనకు, తనలోని భావనలకి అనుకూలంగా మలుచుకోవడానికి మానవునికి జీవితంలో ఒకే ఒకసారి యివ్వబడే యువశక్తి అపూర్వమైంది. ఆత్మ విశ్వాసం తొణికిసలాడుతోంటే నమ్మిన ఆశయం కోసం వెనుకా ముందూ చూడకుండా అగాధ పాతాళంలోకి కూడ దూకించగల దశ యౌవన దశ!

ఇంటర్ చదువుతున్న రోజుల్లోనే పెండ్లయింది రాజారావుకి. అందమైన కమల కళ్ళల్లో తన నీడలు చూచుకుని ఆనందిస్తూ అదే సర్వస్వమూ అని అనుకునేవాడు. కాలేక పోయూ డతను. భార్య నెంతగానో ప్రేమిస్తున్నా అంతకంటె యెక్కువగా యెన్నో నాళ్లనుండి తన హృదయంలో పెంచి పోషించుకుంటున్న భావాలను ప్రేమిస్తూ వుండేవాడతను. ఫలితంగా ప్రజోద్యమాలతో పరిచయమైంది. పొగచూరిన

గోడల్లా బ్రతికే కష్టజీవుల ముందు తన భావనా జగత్తు నుంచితే వారు కొన్ని క్షణాలపాటు మైమరచి పోయేవారు. గడ్డకట్టుకపోయిన కష్టాలు, బాధలు, అనవరతమూ తాండ వించే వారి కళ్లు రాజారావు మాటలతో మిలమిలా మెరిసేవి.

పెన్షన్ తీసుకుంటూ మంచంలో వుండే తండ్రి బ్రతిమి లాటలు, జాలిగా భర్తవైపు చూచే కమల విశాల నయనా ల్లోంచి వచ్చే చూపుల విన్నపాలు, పెళ్లికెదుగుతున్న సోదరి అహల్యలో ప్రవేశించే యవ్వనమూ – యివేవి రాజారావు ఉద్రేక వుత్సాహాల్ని మరలించలేకపోయాయి. చదువుకి స్వస్తి వాచకం పలికించాడు. ప్రక్క గ్రామంలో అమాయక అనాధ రైతులమీద జరిగే బలవంతపు ధాన్యపు ప్రొక్యూర్ మెంటును ప్రతిఘటించాడు. గాదెలకు గాదెలు నింపబడ్డ మేడ యిళ్లు, పాలరాతి బంగళాలు వదిలి, మురికి గుడిశల కుండల్లో వుండే ధాన్యాన్ని బలవంతంగా తీసుకుంటం, అతనిలో విస్మయ క్రోధాల్ని పుట్టింపజేశాయి. అనుచరులు వెంటరాగా అధికా రుల్ని నిలదీసి న్యాయమేమిటో చెప్పమని అడిగాడు. శాసనా లకి వ్యతిరేకంగా వందలుగాదు, వేలాది పుట్లధాన్యం ఎక్కడ మూలుగుతూ వుందో ఆమూకి తెలుసుకోలేకపోతే తాను వచ్చి చూపుతా నన్నాడు. పాలనా దండానికి పక్షపాత మేమిటని ప్రశ్నించాడు. అంతే–అతను చేసింది!

కాని, మరి రెండు రోజులకే అతను అరెస్టు చేయ

బడ్డాడు. ప్రభుత్వోద్యోగులపై బలప్రయోగానికి పూను కున్నాడని కేసు పెట్టబడింది. మూడుకాళ్ళతో నడువలేక నడచివచ్చిన ముసలి తండ్రి, భార్య అతన్ని బేషరతుగా క్షమా భిక్ష కోరుకోమని ప్రాధేయపడ్డారు; బ్రతిమిలాడారు; కన్నీరు కార్చారు. వారి కన్నీళ్లు చూస్తూవుంటే అతనికి దుఃఖం పెల్లుబికి వచ్చింది; జల జలా అతని నయనద్వయంనుండి బాష్పకణాలు రాలాయి. కాని క్షమించమని కోరేందుకు అతడు నిరాకరించాడు. తను చేసినదానిలో తప్పేమీ లేదని అతని ఆత్మ వుద్ఘోషిస్తోంది. తప్పు చేయలేదనే విశ్వాసం సంపూర్తిగా వున్నప్పుడు క్షమించమని కోరటం అర్థంలేని విషయం! అది ఆత్మద్రోహమవుతుంది. ఆత్మద్రోహం ఆత్మహత్యకంటే తక్కువయేంకాదు. అలా ఆలోచించిన రాజారావు పోలీసు లిచ్చిన అవకాశాన్ని కాలద్రోశాడు. ఫలితంగా సంవత్సరం శిక్ష పడింది రాజారావుకు.

ఇరవై రెండవయేట నూతన వధువుతో సరస సల్లాపా లాడుతూ, మధుర మధురానుభూతుల్ని నెమరువేసుకుంటూ గడిచే కాలాన్ని చూచి విసుగుకోవలసిన రాజారావు కారా గారంలో నాలుగు గోడలమధ్య బంధింపబడి ఆకాశంలో మిణుకు మిణుకులాడే తారకల్ని చూచుకుంటూ కాలం తన గమనాన్ని మరచి వూరకే తిష్టవేసుకుందా అని అనుకోవలసి వచ్చింది. కాని నెలతిరక్కముందే అతనికో సహచరుడు లభిం చాడు. విచారణకూడ లేకుండా జైల్లోత్రుక్కబడిన మేధా వతడు. ఆయన బయట వుండటం, ఆయన భావాలు ప్రజల్లో

నడయాడటం శాంతిభద్రతలకి భంగమని తోచింది ప్రభు త్వానికి. అంతే-కృష్ణజన్మవాసం ప్రత్యక్షమయింది ఆయనకు!

ఆయన తన వెంట బోలెడన్ని పుస్తకాలు తెచ్చుకున్నాడు. గంటల తరబడి అయనమాటలు వింటూ ఆశ్చర్యపోయేవాడు రాజారావు. ఆయన చెప్పే మాటల్ని, జీవిత సత్యాల్ని వింటూ వుంటే తనకేమో తెలుసునని యిన్నినాళ్ళు భావించుకుంటున్న అతని అహంకూడ దెబ్బ తింది. రోమారోలా, పుష్కిన్, గోగెల్, గోర్కి, టాల్‌స్టాయ్, హోవర్డ్‌ఫాస్ట్ మొదలైన విదేశి రచయితల విజ్ఞాన శిఖరాల్నందుకునే కళామయమైన పుస్తకాలు చదివాడు జైల్లో. మానవత్వం తొణికిసలాడే మహాకవుల రచనలు అతని హృదయాన్ని ఎంతో మార్చాయి. రష్యాలోని మోటు జాతివారైన కోసక్ యువతీ జీవితాన్ని మహాకవి వర్ణిస్తూవుంటే మన పల్లెటూరి అమాయక బాలిక రూపము దాన్లో కనుపించింది రాజారావుకి. ఫ్రాన్సులోని కులీన కుటుంబాలని పిలువబడే యిళ్లలో తాండవించే కృత్రిమ నాగరికతను గస్టావ్ ఫ్లొబర్ట్ వర్ణిస్తూవుంటే దాని ప్రతిరూపం మన పట్టణాల్లోని ధనిక కుటుంబాలతో పోల్చుకొని ఆనందించాడు రాజారావు. అందుకే వారు మహా కవులైనారు; విశ్వ మానవ సౌభ్రాతృత్వం తొణికిసలాడే వారి రచనలు రాజారావు హృదయాన్ని వుర్రూతలూగించాయి. చెళ్లపిళ్ల, శ్రీపాద, అడవి, విశ్వనాథ, శ్రీశ్రీలాంటి ఆధునిక ఆంధ్రకవుల గ్రంథాలు చదివేడు; ఆంధ్ర సాహిత్యంతో యిన్నాళ్ళు సంబంధం పెట్టు కోనందుకు చింతించాడు. స్వతహాగా భావుకుడైన రాజారావు దృష్టి సాహిత్యంవైపు పూర్తిగా మళ్లింది.

సంవత్సరం గడిచింది. పంట్రెండు మాసాలు ఎప్పుడో వచ్చిపోయినట్లయింది. రాజారావు విడుదలయినాడు. క్రొత్త వుత్సాహము, క్రొత్త దృష్టి, క్రొత్త పరిశీలనా దృష్టి - అంతా క్రొత్తగా, సరిక్రొత్త మానవుడిగా కారాగారంనుండి బయటకు వచ్చాడు. కాని ఆ సంవత్సరంలోనే అతని సంసారంలోకూడ యెన్నో మార్పులు జరిగిపోయినవి.

వృద్ధుడైన తండ్రి గతించాడు. కుటుంబంలో తక్కువైన సంఖ్యను పూరించేందుకన్నట్లు రాజారావు జైలుకు పోయేనాటికి మూడు మాసాల గర్భవతియైన కమల బిడ్డడ్ని కంది. ముసలాడి మరణంతో సంసారాని కాధారమైన పెన్షన్ నిలచిపోయింది. ఫిఫ్తుఫారం చదువుతున్న అహల్య చదువు నిలిచిపోయింది. ఆపదలో ఆదుకోకుంటే బాగుండదనే వుద్దేశంతో అపవాదానికి వెరచిన కమలమ్మ అన్నయ్య విశ్వనాధం ఆ సంసారాన్ని తన యింటికి- తెనాలికి తీసుకెళ్ళాడు.

విశ్వనాధం తాలూకా ఆఫీసు గుమాస్తా. తన ఆదాయం తనకే సరిపోదు. అయినా విధిలేక చెల్లెలి సంసారాన్ని నెత్తిన వేసుకున్నాడు. అతని భార్య చిరబురలు-బావగారి అవివేకాన్ని వర్ణించి యికమీదనైనా బాపుండమని విశ్వనాధం బోధించిన నీతిబోధనలు కమలమ్మని పూర్తిగా మార్చివేశాయి. తన కర్మ కాలే అలాంటివాడికి భార్య నయ్యానని ఆమె సణుక్కుంటూ వుండేది. అసంతృప్తి, ఇతరులకంటె హీనంగా వున్నానే అనే అభిమానము ఆమె నరనరాన జీర్ణించుకొనిపోయినవి. భార్యా బిడ్డలను పరాయి పంచల పాలుజేసి లోకాన్ని వుద్ధరించ పూనుకున్నాడని రాజారావుమీద ఆమె

మాటి మాటికి విసుగుకొనేది. రాజారావు జైలునుంచి తిరిగి రావటంతో ఆ సంసారం తిరిగి విజయవాడ చేరుకుంది.

భావనా జగత్తుకు యదార్థ జీవితాలకి యెప్పుడూ చుక్కెదురే! జైలుకుపోక ముందటి రాజారావుకాదు నేడ తను! ఆ నాడతనిపై సంసార బాధ్యత లేదు. ఇంట్లో యేము న్నాయో, యేమి లేవో అనే ఆరాటమసలు ఉండేదికాదు. కాని నేడు వాస్తవిక జగత్తులోకి దిగిరావలసి వచ్చింది. కథలు, గేయాలు వ్రాసి పత్రికలకు పంపేవాడు. వాటిలో చాలమటుకు అచ్చు అయేవి. కాని అన్నింటికి ప్రతిఫలం ముట్టేదిగాదు. ప్రముఖంగా అతని కథలు ప్రచురించుకొన్న కొన్ని పత్రికలు అతనికి 'ఫ్రీ' కాపీనికూడ పంపేవిగావు. కాని కొన్ని పత్రికలగుండా నెలకు పాతికా, ముప్ఫయ్ రూపాయల వరకు వచ్చేవి. తద్వారానే జీవితాన్ని కొనసాగించాలనుకున్న రాజారావు ఆశలు నిరాశలయ్యాయి. అతని రచనలు చదివిన వారు అతడిపై అభినందనల వర్షం కురుపిస్తారు. అతడు సంతృప్తితో నిండుగా నవ్వుకుంటాడు. కాని దానివల్లే కడుపు నిండదు గదా! ఊళ్ళో చిల్లర అప్పులు మోపయ్యాయి. మరో సంవత్సరమాలాగే గడచింది. మరోబిడ్డ డనతరించేడు! యుక్త వయస్కురాలై యింటిలో కూర్చున్న చెల్లెల అహల్య సమస్య అనిరతము అతని బుర్రలో కల్లోలాన్ని రేపేది!

రాజారావు తండ్రి పి. డబ్ల్యు. డి. ఆఫీసులో అప్పర్ డివిజన్ గుమస్తా గిరి చేశేవాడు. అందుచేత పేరు పొందిన కంట్రాక్టర్ నారాయణరావుగారికి ఆయనకు మంచి స్నేహ ముండేది. రాజారావునుకూడ నారాయణరావుగారు బాగా

ఎరుగుదురు. ఇష్టంలేకున్నా విధిలేక ఒక సుముహూర్తాన రాజారావు రావుగార్ని దర్శనం చేసుకున్నాడు. తన బిజినెస్ అభివృద్ధి అవ్వేందుకు ఎన్నోవిధాల సహాయపడిన అతని తండ్రి స్నేహాన్ని తలచుకొని నారాయణరావుగారు రాజా రావుని గుమస్తాగా తీసుకున్నారు. ఆరునెల్ల లగాయితు ఆ వుద్యోగం చేస్తున్నాడతను. కరస్పాండెన్సు నడపటం, లెక్కలు వ్రాయటం-యిదీ పని! నెలకు అరవై రూపాయలిస్తారాయన. పైగా పత్రికలద్వారా వచ్చే పాతికాపరకతో సంసారం గడచి పోతోంది. పిల్లాడి పాలల్లోకి పంచదార లేదు. ఇంట్లో బియ్యం నిండుకున్నాయి. సతీమణి ఆల్టిమేటం యిచ్చింది. రావుగారు కర్నూల్‌కి వెళ్ళినందున నాలుగోతేది అయినా ఆ నెల జీత మింకా తీసుకోలేదు. అంచేత రాజారావు తక్షణం అవస రాలు తరుముతూవుంటే డబ్బుకోసం గాంధీనగర్‌లో ఉన్న రావుగారింటివైపు గబ గబా నడిచాడు.

ప్రపంచం చాల వింతైంది. రాజారావొక్కడేగాదు, యెందరో తమ కిష్టం కాని పనులు బలవంతాన చేస్తూనే వుంటారు. ఇష్టాయిష్టాల్ను దృష్టిలో పెట్టుకొని యెదురుతిరు గుతే-సర్వ నాశనమవుతారు. సర్వనాశనమైనా పర్వాలేదని ఆత్మద్రోహానికి తలపడనివారె, ఆత్మ సంచయంగలవారే నేమో మహాత్ములు!

## మూడవ ప్రకరణము

ట్రైన్ దిగిన వెంటనే చేతులు జోడించి నమస్కరిస్తూ "వెళ్లి వస్తానండీ!" అన్నాడు సూర్యనారాయణ.

నారాయణరావుగారు చిన్నగా నవ్వుతూ "ఎక్కడికి?" ప్రశ్నించారు.

"ఏదైనా...హోటల్‌కి – సాయంకాలం యింటికివచ్చి మీ దర్శనం చేసుకుంటా" అన్నాడు సూర్యనారాయణ వినయంగా.

నారాయణరావుగారు జవాబేమీ యివ్వకుండా పోర్టర్ని కేకవేశారు. తన హోల్డాలు, పెట్టెలేగాకుండా సూర్యనారాయణ చేతిలోని బ్యాగ్‌నుకూడ తీసుకోమని వాడికి సైగ చేశారు. "ఇక పద!" అన్నారాయన గంభీరంగా సూర్యాన్ని వుద్దేశించి.

తన చేతిలోని బ్యాగ్‌ని పోర్టర్ లాక్కుంటే రావుగారివైపు ఆశ్చర్యంగా చూస్తూ ఆయనవెంట బయలుదేరాడు సూర్యం. స్టేషన్ బయటికి వచ్చిన తర్వాత 'టాక్సీ'ని కేకవేశారాయన. కిక్కురు మనకుండా సూర్యనారాయణ ఆయన వెంట టాక్సీలో కూర్చున్నాడు. "గౌరీభవన్; గాంధీనగర్" అన్నారు రావుగారు. కారు కదిలింది. అయోమయంలోపడిన వాడిలా అవస్థపడుతున్న సూర్యనారాయణవైపు చిరునవ్వుతో చూస్తూ ఆయన "డబ్బు మోపుగా వుందేం?" ప్రశ్నించారు. ఆ ప్రశ్నతో సూర్యనారాయణ మరింత కుంచించుక కూర్చున్నాడు. సిగ్గుతో అతని ముఖం లేత జేగురురంగు దాల్చింది. అమాయకురాలైన అమ్మాయిలా సిగ్గుపడుతున్న అతనివైపు పరిశీలనగా చూస్తూ "సూర్యం! నీ గురించి నీవింకేం గాభరా

పడనక్కర లేదు. అన్నింటికి నేనున్నానుగా!" అన్నారు నారాయణరావుగారు.

కృతజ్ఞతా పూర్వకమైన నయనాలతో ఆయనవైపు చూచి తలవంచుకున్నాడు సూర్యనారాయణ.

మూడవ తరగతి రైలుపెట్టెలో ప్రయాణం చేస్తోంటే నారాయణరావుగార్ని యేదో ఒక మాదిరి ధనవంతుడను కున్నాడు సూర్యం! గౌరీ భవనాన్ని చూస్తూనే అతని అంచనాలు తలక్రిందులైనాయి. విశాలమైన ఆవరణలో పెద్ద భవనమూ - చుట్టూ యెంతో అందంగా అమర్చిన పూల మొక్కల పాదులు, సమంగా కోయబడ్డ వివిధజాతుల గడ్డి. భవనానికి పోయే దారికిరువైపులా తొట్లలో పేర్చబడ్డ రకరకాలైన క్రోటన్ మొక్కలు - ఆర్చిపలె అందంగా అమర్చబడ్డ జాజి తీగలు - ఓహ్! దేవేంద్ర భవనంలా వుంది. రావుగారి వెంట భవనంలోకి పోతోంటే సూర్యానికి కలలో నడచి నట్లుగా వుంది. పెద్ద హాలు. వివిధరకాలైన చిత్రాలతో గోడలన్ని అలంకరింపబడి వున్నాయి. విలువైన ఫర్నిచర్ క్రమబద్ధంగా సర్దబడివుంది.

"ఏడుకొండలూ!" కేక వేశారు రావుగారు.

ఏడుకొండలు యేడు కొండలంత లేకున్నా ఒక చిన్న కొండమాదిరే వున్నాడు. పొట్టిగా లావుగా వున్నాడు. ఒగర్చుకుంటూ వచ్చాడు. "దండాలండీ!" అన్నాడు.

"వీడిని మేడమీద వుత్తరంవేపు గదిలోకి తీసుకెళ్ళు. వెంటనే స్నానానికి సిద్ధం చేయి." ఆజ్ఞాపించారు రావుగారు.

సూర్యం మారుమాటాడకుండా యేడుకొండల వెంట తల వంచుకొని నడిచాడు.

ఊరకే మామూలుగా ఒక వ్యక్తిని చూచినప్పటి కంటె, వాడి ఆస్తిపాస్తులు, గౌరవమూ చూచినప్పుడు అతడి మీద యింకా భక్తి ప్రమత్తులు మిక్కుటమవుతవి. అంద విహీనుడైనా, అంతరాత్మ అసలే లేనివాడైనా వాడికి నాల్గు రాళ్లుంటే వాడు సమాజంలో యిట్టే గౌరవింపబడతాడు. అందుకే 'ధనమూలమిదం జగత్' అన్నారు పెద్దలు. ఆ మేడను, ఆ భోగభాగ్యాలను చూస్తూవుంటే సూర్యనారా యణకు రావుగారిపైన ముందుకంటే యెంతో యెక్కువ గౌరవము ఏర్పడింది! ఆయనముందు తనేపాటి అని అను కున్నాడు. అనుకోకుండానే అదృష్టదేవత అకస్మాత్తుగా వరించి మానవుల జీవితాలతో సయ్యాటలాట్టం అతను సిని మాల్లో మాత్రమే చూచాడు. నవలల్లో మాత్రమే చదివాడు. కాని యిప్పుడు తన జీవితంలోనే తటస్థించింది. దీని పరిణామా లేలా ఉంటాయో!...కుషన్ కుర్చీలో కూర్చుని ఆలోచనలో పడ్డాడు సూర్యనారాయణ. ఇంతలోనే స్నానానికి పిలుపు వచ్చింది.

ఏడుకొండలు ఎంతో బాగా తలంటాడు. స్నానం ముగించి తనకున్న మూడు జతల్లో మంచిబట్టలను యేరుకొని ధరించాడు. హనావా పాంటు, బెన్నీ చారల చొక్కా-యివే అతని బట్టల్లోకెల్లా మంచివి! అంతలోనే యేడుకొండలు తిరిగి హాజర్! రావుగారు రమ్మంటున్నారని పిలుపు. హాల్లో రావు

గారే గాకుండా మరోవ్యక్తికూడ కూచుని ఉన్నాడు. రావు గారు సూర్యాన్ని ఆప్యాయంగా కళ్లతోనే ఆహ్వానిస్తూ కుర్చీ చూపారు. "ఈయన రాజారావు! మంచి రచయిత. కవీని." సన్నటి ఆ వ్యక్తికి పరిచయం చేశారు రావుగారు.

మధ్యలోనే రాజారావందుకొని "వీరి గుమస్తాని కూడాను" అన్నాడు.

"ఆ–" చప్పరించారు రావుగారు. "సూర్యనారాయణగారీయన. మా దగ్గరచుట్టం!" సూర్యాన్ని రాజారావుకు పరిచయం చేశారు ఆయన. పరస్పర నమస్కారాలయినవి. నాయర్ తెచ్చిన టిఫిన్ తిని, కాఫీ త్రాగారు.

"ఏడుకొండలూ!" పిలిచారాయన. "డ్రైవర్ని కారు సిద్ధంచేయమను" అన్నారు.

"కారు లేదండీ! అమ్మాయిగారు కాలేజికి తీసు కెళ్ళారు." యేడుకొండలు జవాబిచ్చాడు.

"సిటీ బస్‌లో వెళతాంలెండి!" రాజారావన్నాడు.

"సూర్యం! విజయవాడకు రావటం యిదే ప్రథమం గదూ! రాజారా వెంట వెళ్ళిరా!" అంటూ జవాబు నాశించ కుండానే నారాయణరావుగారు మేడపైకి వెళ్ళారు.

సూర్యం ఎదురుగా వున్న రాజారావువైపు చూచాడు. రాజారావుకూడ సరిగా అప్పుడే సూర్యంవైపు చూచాడు. ఒక క్షణంపాటు యిద్దరి కళ్లు కలుసుకున్నాయి. వెంటనే యిద్దరు చూపులు మరలించుకున్నారు కూడ.

బస్ రావటానికి యింకా పది నిముషాల టైముంది. గాంధీ నగర్‌లోని నాలుగు రోడ్ల కూడలివద్ద నిలుచున్నారు యిద్దరు. రాజారావు బడ్డీకొట్టులో అయిదు రూపాయలనోటుని మార్చి సిగరెట్లు, నిప్పుపెట్టె తీసుకున్నాడు. తను అంటించ బోతూ సూర్యానికికూడ ఒకటి ఆఫర్ చేయబోయాడు. కాని "క్షమించండి!" అన్నాడు సూర్యం.

"మీరు పొగ త్రాగ రనుకుంటాను! చాల సంతోష నండీ! వెధవ అలవాటునుండి బయటపడలేకపోతున్నాను." రాజారావు సిగరెట్ పొగవదుల్తూ అన్నాడు.

మానవుని జీవితంలో మందకొడిగా మార్పంటూ లేకుండా యెన్నో రోజులు వూరకే జరిగిపోతూ ఉంటాయి. కాని వున్నట్టుండి జరిగే మార్పులే ఒక్కొక్కసారి ఆశ్చర్యాన్ని కలుగజేస్తూవుంటాయి! తనెవరు? నిన్న యీవేళకెల్లా తనెక్కడ వున్నాడు? అప్పటి తనలోని వూహాపోహ లేమిటి?— కాని యిరవై నాలుగు గంటలుగూడ కాలేదు. ఏ అదృశ్యశక్తో జీవితాన్ని యిట్టే మార్చేసింది. ట్రైన్‌లో రావుగారి పరిచయమూ—ఆయన తనపట్ల చూపుతున్న ఆదరాభిమానాలు! నిలుచుంటే దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు సూర్యనారాయణ. అలా ఆలోచిస్తున్న సూర్యం యోచనలు ఒక్కసారిగా రాజారావు వైపుకు మరలాయి. సూర్యం పెద్దగా సాహిత్యకృషిలో పాల్గొన కున్నా సాహిత్యాభిలాషి. వీలయినన్ని పుస్తకాలు చదవటానికి యెప్పుడూ సిద్ధమై వుంటాడు. రావుగారు రాజారావుని పరిచయంచేస్తూ 'రచయిత - కవీ' అని చెప్పారు. సూర్యం

దృష్టిలో రచయితల కెంతో గౌరవముంది. పరిణతి పొందిన మానవోత్తములే రచయితలని అతని భావన! కమనీయ ప్రపంచాల్ని సృష్టిస్తూ తమతోపాటే చదివే పాఠకులందర్ని తమ వూహా జగత్తులో విహరింపజేసే రచయితలు—వారి జీవితాలు—పసిపాపల చిరునవ్వులవలె, మలయ మారుతంలా, జాబిల్లి పండు వెన్నెల్లా నిష్కల్మషంగాను, నిష్కల్మషంగాను వుంటాయని అతని భావన! కాని చూస్తోంటే రాజారావు మామూలు మనిషిలాగే కనుపిస్తున్నాడు. పీక్కుపోయిన ముఖమూ - సన్నగా పెరిగిన గడ్డమూ - మామూలు వారికంటె యింకా తక్కువ దశలోనే వున్నట్టున్నాడు. ఏదియేమైనా లోకానుభవం యేమాత్రం లేని సూర్యనారాయణ రాజారావుమీద గొప్ప గౌరవభావాన్ని సృష్టించుకున్నాడు.

"అబ్బ! బస్ తగలడుతోందండి!" అన్నాడు రాజారావు.

సూర్యం యెదురుగా రోడ్డువైపు దృష్టి సారించి చూచాడు. దూరంగా కనుచూపుమేర దూరంలో బస్ వస్తోంది. పదిగంటలయినట్లుంది. గాంధీనగర్‌లోని కస్తూరిబా హైస్కూల్‌కిపోయే బాల బాలికలు గుంపులు గుంపులుగా పోతున్నారు. చలికాలమే అయినా ఎండ అప్పుడే కొంచం తీక్షణంగా కాస్తోంది.

"ఇంటివద్ద చిన్నపనుంది. కృష్ణలంకకెళ్ళి తర్వాత బట్టల కొట్టుకు వెళ్దాం!" అన్నాడు రాజారావు సూర్యంవైపు

చూచి, సూర్యం తలూపాడు. బట్టలకొట్టుకెందుకో తనకి తెలి యదు. అయినా తల వూపాడు!

బస్‌లో కావలసినంత స్థలముంది. 'రామమోహన లైబ్రరీ' అంటూ రాజారావు చిల్లర డబ్బులు కండక్టర్ చేతిలో వేశాడు. మోటారు కదలింది. రెండు నిముషాలకో చోట కొద్దిక్షణాలు ఆగుతూ, దిగిపోయేవారు దిగిపోతుంటే క్రొత్తగా ఎక్కేవారు ఎక్కుతుంటే బస్ సాగిపోతోంది. నాటకంలో పాత్రల ప్రవేశ నిర్గమాలు, ప్రపంచంలో జనన మరణాలు గుర్తుకు వచ్చినవి - ప్రయాణికుల రాకపోకలను గమనించిన సూర్యనారాయణకు. తను వూహించిన పోలిక లకు తనలోతానే చిన్నగా నవ్వుకున్నాడు.

పట్టపగలే ఎలెక్ట్రిక్ లైట్ల కాంతిలో మెరిసే హోటళ్ల లోని రంగు రంగుల గోడలు, సీతాకోక చిలుకల్లా సింగా రించుకొని పోతూ వున్న స్త్రీలు, ఆకర్షణీయంగా అమర్చబడి నట్లున్న బట్టల దుకాణాలు చూస్తూ కూర్చున్నాడు సూర్యం.

"రామమోహన్ లైబ్రరీ!" కేకవేశాడు కండక్టర్.

యువకులిద్దరు బస్ దిగారు. బందర్ కాలువమీది వంతెన రాత్రిపడ్డ వానచినుకులతో రొచ్చురొచ్చుగా తయా రైంది. మునికాలిప్రేళ్ళమీద నడుస్తూ బురద దాటారు. కృష్ణానదికి బందర్ కాలువకు మధ్యనున్న ప్రాంతం కృష్ణ లంక. కొన్నేళ్లక్రితంవరకు నాగజెముడు ముళ్ళతోను, దయ్యాల్లావున్న తుమ్మచెట్లతోను స్మశానానికికూడ వుపయో గించని ప్రాంతమది. కాని పట్టణం పెరగటంతో ఆ ప్రాంత

మంతా యిళ్ళతో కళకళలాడింది. కృష్ణవేణమ్మ పాదాల వరకు విస్తరించింది. పెద్దపెద్ద మేడలుకూడా కట్టారు. కాని యిప్పటికి కూడ ప్రతియేడాదీ కృష్ణానది పొంగినప్పుడెల్లా కృష్ణ లంక వీధుల్లోకి మోకాళ్ళలోతువరకు నీళ్ళు వస్తాయి. ఒక్కొక్కప్పుడు వరదలు కొద్దిగా యెక్కువైతే యిళ్ళల్లోకి కూడ తొంగిచూస్తుంది కృష్ణవేణమ్మ! కాని, ఆ వరదల ప్రభృతము గంటలు - అంతే. మహాఅయితే ఒకటి రెండు రోజులు. ఇళ్ళు ఖాళీచేసి గట్టుమీద కూర్చుని తిరిగి నీరు తగ్గుతూనే మామూలుగావుంటూరు వారు—కాని కృష్ణానదిమీద నుంచివచ్చే చల్లగాలితో ఆ ప్రాంతం పట్టణంలోని మిగిలిన ప్రాంతాలకంటే ఆరోగ్యంగా వుంటుంది. ఇళ్ళ అద్దెలుకూడ కొద్దిగా చౌక!

సూర్యాన్ని తన యింట్లోకి తీసుకవెళ్ళడానికి కొద్దిగా సిగ్గుపడ్డాడు రాజారావు. కాని పేదతనం పాపంగాదనుకుంటూ అతన్ని రోడ్డుమీద నిలబెట్టటం మర్యాదకు భంగమని తలచి తను ఇంట్లోకి దారితీస్తూ "రండి" అంటూ ఆప్యాయంగా ఆహ్వానించాడు.

హాల్లో యెవరూ లేరు. రాజారావు, సూర్యం రాజారావు 'డ్రాయింగ్ రూమ్'లోకి నడిచారు. చాపమీద కూర్చుని అన్న వుదయం వ్రాసిన కథని వేరే కాగితంమీద సాఫీగా వ్రాస్తోంది అహల్య. కాళ్ల చప్పుడు విని కళ్ళెత్తి చూచింది. తన అన్నేగాకుండా మరో నూతన వ్యక్తి వున్నాడు. కాగితం, కలాల్ను అక్కడ వదిలేసి ఆమె లేచింది. చూడకూడదను

కుంటూనే సూర్యం ఆవిడవైపు చూచాడు. బయటకు నడువ బోయి ఆమె అకస్మాత్తుగా అతనివైపు అప్పుడే చూచింది. ఒక లిప్తకాలమాత్రం ఆ నాలుగు కళ్లు ఒక్కమాటు కలుసు కున్నాయి. ఆమె గబగబా వెళ్ళిపోయింది. కారుమేఘాలు గ్రమ్ముకున్న ఆకాశంలో తటిల్లత తళుక్కుమని మెరిసినట్ట యింది. దానిమ్మగింజల్లాంటి పలువరుస, విశాల నయనాలు, కనుబొమలు, దబ్బపండు ఛాయగాకున్నా యిట్టే ఆకర్షించే ఆ వంటిరంగు, అన్నింటికంటె మిన్నగా యే అలంకారాలు, పై మెరుగులు లేకున్నా నిరాడంబరంగా కను పించే ఆమె సహజసౌందర్యమూ సూర్యాన్ని విస్తుపోయేలా చేసింది. హఠాత్తుగా ఎలెక్ట్రిక్‌షాక్ తిన్నవాడిలా 'ఫీల'యి నాడు. అతనికి తెలియకుండానే అతని హృదయంలోని హృదయతంత్రువులు సున్నితంగా మీటబడినట్లు భావనను పొందాడు.

"కూర్చోండి! ఇప్పుడే వచ్చేస్తాను" అంటూ రాజా రావు యింట్లోకి వెళ్లిపోయాడు.

సూర్యం కొద్దినిముషాలపాటు ఆ గదిని పరికించి చూచాడు. పేదతనం ఇట్టే కనుపిస్తున్నా స్వచ్ఛత, నిరాడం బరతలకు తావలమైవున్నట్లున్న ఆ గది, పుస్తకాల వరుసలు, ఆ వాతావరణం అతనికి యెంతో తృప్తినిస్తున్నట్లు అనిపిం చింది.

రాజారావు మరీ బలవంతంచేస్తే కాఫీ తీసుకున్నాడు సూర్యం. తర్వాత బయలుదేరి బజారులో బట్టలుకొని

పన్రెండుగంటలకల్లా నారాయణరావుగారి ఇల్లు చేరు కున్నారు.

## నాలుగవ ప్రకరణము

'ఆదరించాలంటేను ఆప్యాయంగా ఆదుకోవాలంటేను తనలాంటివారు ప్రపంచంలో కోకొల్లలు! తనలో ప్రత్యే కతేముంది?' యెంతో తరచి చూచినా అతనిలో ప్రత్యేక తేదో అతని దృష్టికే అవుపడలేదు. మరి తన్నెందుకు నారా యణరావుగారలా చేరదీశారు? తనకు తెలియకుండానే వందరూపాయలనోటు రాజారావు చేతికిచ్చి తనకు కావలసి నన్ని బట్టలు కొనిచ్చారు. ఎన్నోయేళ్ళనుండి పరిచయమున్న ఆప్తబంధువులా తన్ను ఆదరిస్తున్నారు.... గదిలో మంచం మీద పడుకొని పచ్చగా వెలుగుతున్న చిన్ని లైట్‌వంకే చూస్తూ ఆలోచనలు సాగిస్తున్నాడు సూర్యనారాయణ.

సినిమాలోని రీళ్ళలాగే జీవితఘట్టాలన్ని హఠాత్తుగా కొన్ని గంటల్లోనే చూపబడే రోజులాగుంది తనకు. ఉదయం తను ట్రైన్ దిగినప్పటినుంచి అంతవరకు జరిగి ఘట్టాలన్నీ ఒకటొకటే నెమరువేసుకోసాగాడు.

రైల్లో సామాన్యుడిగా అవుపించిన నారాయణరావు గారి సిరిసంపదలు, రాజారావుతో తనకు కలిగిన పరిచయము, రాజారావింటివద్ద తను చూచిన యువతి—అన్నీ ఒకదానివెంట వొకటి గుర్తు వస్తున్నాయి. నీటుగా దీటుగావున్న ఆమె నడక, నునుసిగ్గుతో వాలిపోయిన ఆమె విశాల నయనాలు, బిగు

వుగా మనోహరంగావున్న ఆమె శరీరమూ-చూచినప్పటికంటే ఆమెను గురించి ఆలోచిస్తోంటే అవన్నీ అతని హృదయంపై గాఢంగా హత్తుకపోయినవి. ఆమెకంటే అందమైనవా రెందరోనో తను చూచాడు! కాని వా రెవరిలోను లేని ప్రత్యేక ఆకర్షణ శక్తి ఆమెలో ఉందని అతని భావన. ఆమెను గురించి ఆలోచిస్తూవుంటే అతని హృదిలో యేవేవో ఆశలు, అస్పష్టమైన వాంఛలు మొలకెత్తినట్లయినవి. యువ జీవితంలోని ప్రథమ ప్రేమ యెంత వింతైనదో అనుభవంలేని అత డే మెరుగును?

తర్వాత అతని ఆలోచనలు రాత్రి భోజనాల సమయం లోకి పరుగులు దీశాయి. నారాయణరావుగారు సౌదామినిని పరిచయం చేశారు. ఆమె నిజంగా సౌదామినే! సందేహం లేదు. కాలేజిలో చదువుకుంటూ వున్నది. ఆ ఆస్తికంతటికి ఆమె యేకైక వారసురాలు! సౌదామిని ప్రస్తావన తన ఆలోచనలోని కొస్తూనే సూర్యం హృదయంలో సౌదామినికి, తను రాజారావింటివద్ద చూచిన యువతికి పోల్చుకో ప్రారంభించాడు. ఈమెవీ విశాల నయనాలే కాని, ఆమె కళ్లలోని అమాయకత్వానికి ముగ్ధత్వానికి బదులు ఈమె కళ్లలో చిలిపి తనము, గర్వరేఖలు తొణికిసలాడుతున్నవి. ఆమెలో అణుకువకు బదులు యీామెలో గడుసుతనం కనుపించింది. ఆమె పెదవులు సహజమైన యెఱ్ఱటి రంగులో మాత్రమే ఉన్నాయి. ఈమె పెదవులు లిప్‌స్టిక్‌తో కెంపుకాంతు లీనుతున్నవి. ఆమె కదలిపోతోంటే మెరుపుతీగ మాయమయినట్లయింది! అంతే

కాని, యీామె కదులుతోంటే లవండర్ సెంటు వాసనలు గుబాళిస్తున్నవి.

ఆమె యెవరో రాజారావు తనకు పరిచయం చేయనే లేదు. కాని నారాయణరావుగారు యీామెని పరిచయం చేశారు. ఆమెతో తను ఒక్కమాటకూడ మాట్లాడలేదు. ఈమె, తను ఏవేవో మాట్లాడుకున్నారు. అయినా ఆమె రూపం హృదయానికి హత్తుకపోయింది. ఈమె రూపం యెదురుగా ఉన్నప్పుడు మాత్రమే కళ్లకు మిరుమిట్లు గొలిపినట్లు అవుపించింది.

మానవ భావనలు విచిత్రంగా ఉంటాయి. అతనికి తెలియకుండానే కొన్ని సంఘటనలు, కొందరు వ్యక్తులు అతని హృదయపు టంచులమీాద గాఢంగా హత్తుకపోతారు. జాలి, ప్రేమ, అసూయ, ద్వేషము - ఇవి అనుకోకుండానే అతనిలో ఒకొక్కప్పుడు విచిత్రంగా ప్రభవిస్తవి. కారణం లేకుండానే జరిగే ఈ హటాత్ సంఘటనలు నిజంగా ఆలోచించి చూస్తే హేతువాదానికి వాస్తవికత్వానికి నిలబడేవిగా కనుపించవు. కాని అవి యదార్థములే! "ఎందుకు?" అని ప్రశ్నించుకుంటే ఆ అనుభూతులుపొందే వాడిలోనుండే వాటికి జవాబులు లభించవు. ఎందుకో తెలియని సంఘటనలు యేలా అవతరిస్తాయో ఆశ్చర్యంగానే వుంటుంది మరి!

శీతాకాలపు చీకటి రాత్రిలో మెత్తటి పరుపుమీాద కమ్మని అనుభూతుల్ని వూహించుకుంటూనే కన్నుమూశాడు సూర్యనారాయణ.

*

నారాయణరావుగారు మధ్య తరగతి రైతుకుటుంబంలో నుంచి వచ్చినవారు. మెట్రిక్ వరకు చదివారు కూడ. విజయవాడకు సమీపాన్నేవుండే రామవరప్పాడు ఆయన స్వగ్రామం. ఉప్పు సత్యాగ్రహం రోజుల్లో దేశమంతా అట్టుడికే రోజులవి. జాతీయతమీది మమకారము, విదేశీయులమీది విద్వేషమూ దేశమంతటా పిలుస్తే పలికే రోజులవి.విదేశీవస్తు బహిష్కారం ముమ్మరంగా కొనసాగిపోతున్నది. ఆ రోజుల్లో విద్యార్థిగా వున్న నారాయణరావుగారిలోకూడ చైతన్యం పొంగింది. ఇరవైజతల విలువగల విదేశీ గుడ్డల్ని దహనంచేసి ఖద్దరు ధారణ ప్రారంభించారు. పికెటింగ్ లో పాల్గొన్నందుకు ఇరవైనాలుగు గంటలు లాకప్ లోకూడ వుండవలసివచ్చింది. సత్యాగ్రహం చేస్తానని దరఖాస్తుకూడ పెట్టుకున్నారట. కాని వయసు తక్కువని పర్మిషన్ లభించలేదు. వెర్రి ఆవేశంతో ఏమేమో ఆలోచిస్తూ ఉండేవారు నారాయణరావుగారు. ఇవన్ని గమనించిన తండ్రి కొడుకు చదువుకి స్వస్తి చెప్పించి వెంటనే పెళ్లి చేశాడు. కొడుకు పెళ్లయి సంవత్సరమైన తీరకముందే తన బాధ్యతలన్ని తీరినట్లు ఆయన పరలోక గతుడయ్యాడు. తండ్రి పోయేనాటికి ఇరవై యెకరాల బంగారంవంటి పొలం, పదివేల కరెన్సీ ఈయన చేతిలో కొచ్చాయి. రైతు జీవితం మీద రావుగారి కెందుకనో మొదటినుంచి సదభిప్రాయం ఉండేదిగాదు. అందుచేత పొలాన్నంతా కౌలు కిచ్చేసి కాపురం విజయవాడకు మార్చేశారు. చిన్నచిన్న మునిసిపల్ పనులు కంట్రాక్టు తీసుకోవటం ప్రారంభించారు. యువకులు, ఉత్సాహి. పైగా మిగిలిన కంట్రాక్టర్లలో జీర్ణించుకపోయిన

అమితమైన దురాశ, దగాలులేని వారవటంతో ఒక్కొ-క్క-మెట్టే ఆయన బిజినెస్ పైకెక్కింది. మూడేళ్ళకే మునిసిపాలిటి పనులకు స్వస్తిచెప్పి భారీమొత్తం కంట్రాక్టులు తీసుకోవటం ప్రారంభించారు. కాంగ్రెసు, జాతీయోద్యమము- ఆనాటి ఆవేశము అన్నీ పూర్తిగా మరుగుపడిపోయినవి. కాని ఆయన ఆనాటి భావాలకు శిథిల చిహ్నాలుగా ఖద్దర్ ధరించటం, మూడోతరగతి రైలుపెట్టెలో ప్రయాణం చేయటం— కాంగ్రెసు సంస్థకు అడపాతడపా ఆర్థికంగా ఆదుకుంటం మిగిలాయి. భారతదేశానికి స్వతంత్రం రావటంతో వ్యక్తిగా ఆయన పలుకుబడి హెచ్చిందేనని చెప్పాలి. ముందుగా వూహించే ఆయన కాంగ్రెసు సంస్థకు సహాయం చేయకున్నా, ఆ చర్యే ఆయన ఇతోధికమైన పలుకుబడి, ప్రతిష్ట వచ్చేందుకు తోడ్పడింది. రాజకీయాల వూసే ఆయన యెత్తుకోకున్నా యెన్నో సంఘాల్లో గౌరవనీయమైన పదవులు, కార్యవర్గ సభ్యత్వాలు ఉండటం అందు కుదాహరణ. తన చుట్టూవున్న వ్యక్తులకు, సమాజానికి అనుగుణంగా ప్రవర్తిస్తూ అందరి మెప్పులు పొందటంలో రావుగారు ఆరితేరారు.

విజయవాడలోని గాంధీనగరంలో పెద్ద భవనము, నాలుగయిదు లక్షలరూపాయలతో బిజినెస్ సాగించటమూ, కావలసినంత పేరుప్రతిష్టలు - అన్నీ సమకూరాయాయనకు. కాని ఆయనకున్న చింతల్లా ఒకటే! అదే సౌదామినినిగూర్చి. సౌదామిని నాలుగునెలల శిశువుగావున్నప్పుడే ఆయన భార్య గతించింది. భార్యమీద ఆయనకున్న మమకారాన్నంతా ఆ నిసువు మీద కేంద్రీకరించారు. పెంచారు. ఎందరో మిత్రులు,

హితాభిలాషులు ఆయనను మళ్లీ పెళ్లిచేసుకోమని బాగా వత్తిడి పెట్టారు. కాని మరోసారి వివాహమాడటం ఆయన కిష్టం కాలేదు. చిరునవ్వులతోనే వారి సూచనలను నిరాకరించేవారు.

సౌదామిని పదహారు వసంతాల్ని చూచింది. జవజవలాడే నవయవ్వనంతో విలసిల్లే ఆమెకోసం యెన్నో పెళ్లి సంబంధాలు వచ్చాయి. అన్నింటిని రావుగారు త్రోసిపుచ్చారు. ఆయన ఆలోచనలు వేరువిధంగా వున్నాయి. ఒకనాడు బిడ్డ కనుపించకపోతే ఆయనకు వెర్రెత్తినట్లుంటుంది. అలాంటప్పుడు ఆమెకు వివాహంచేసి శాశ్వతంగా ఎడబాటును సహించాలనుకోవటం ఆయనకు వూహాలోకూడా అమితబాధాకరంగావుండే విషయమే! అరవైయేళ్ల జీవితానుభవంతో ఆయన ఒక నిర్ణయానికి వచ్చారు. అదేమంటే, ప్రపంచమంతా డబ్బుచుట్టూ తిరుగుతుందని, సూర్యుడెంత ఘనుడో డబ్బు కూడ అంతకంటే తక్కువ ఘనత కలిగిందిగాదని. ప్రపంచం - అంటే భూమి సూర్యునిచుట్టూ మాత్రమే తిరిగే వుపగ్రహంకాదు, డబ్బు చుట్టూ కూడ తిరిగే వుపగ్రహమే! ఆలాంటి డబ్బు తనవద్ద కావలసినంతవుంది. కాబట్టి యెవరైనా మంచి యువకుడ్ని చూచి తన యింట్లోనే వుంచుకొని, బిడ్డనిచ్చి పెళ్లిచేయాలని ఆయన అభిప్రాయం. సౌదామిని సౌందర్యానికి భ్రమసినవాళ్ళు, ఆయన ఆస్తి చూచి నోట్లో నీరూరుంచుకునేవారు చాలమందేవున్నారు. కాని వారెవరు ఆయన దృష్టిలో పడలేదు. తల్లిదండ్రులు, బంధువులు, జంఝాటం లేనివాడు కావాలి! విద్యావంతుడుకావాలి! రూపవంతుడుగా

కూడ వుండాలి. అన్నింటికంటే బుద్ధిమంతుడై వుండాలి. లేకుంటే తను జీవితాన్నే పణంగా వెచ్చించి సంపాదించిన ధన మంతా తన కళ్లెదుటే కర్పూరంలా హరించుకపోవచ్చు; బుద్ధిమంతుడు అనేదానికి నిర్వచనము పలువురిదృష్టిలో పలు రకాలు. కాని, రావుగారి దృష్టిలో బుద్ధిమంతుడంటే వున్న డబ్బు వూరకే ఖర్చుపెట్టేవాడు గాకుండా స్వీయప్రతిభతో దాన్ని మరింత అభివృద్ధి చేసేవాడులావుండి తను నివసించే సమాజంలో మంచివాడని పేరుపొందాలని.

ఆకస్మికంగా రైల్లో చూచిన వెంటనే సూర్యం ఆయన దృష్టి కనుగుణుడుగా తోచాడు. ఆయన అనుకుంటున్న ఆలో చనలు ఫలించబోతూవున్నట్టు ఫీలయినారు. ఒక్కో-సారి మన మనసే మనకు భవిష్యత్తును ఛాయామాత్రంగా తెలుపుతుం దంటారు ? నిజమేనేమో! ఆయన వూహ నిజమైంది. సూర్య నారాయణ చరిత్ర విన్న రావుగారు తృప్తిగా నిట్టూర్చారు. బియ్యమన్నీ వుడికాయో లేదో అనేందుకు ఒక మెతుకుపట్టి చూస్తే చాలదూ ? బాగుంటుంది—చాలాబాగుంది అను కున్నారు రావుగారు. అయినా తొందరేమీలేదు. బిడ్డ ఇంటర్ రెండవయేడు చదువుతోంది. ఈ ఆరుమాసాలలో సూర్య నారాయణను గురించి యింకా వివరంగా తెలుసుకోవచ్చు. అందుకే నారాయణరావుగారు యెంతో ఆప్యాయతతో సూర్యనారాయణను యింటికి తీసుకొచ్చారు. లౌకికజ్ఞానంలో ఆరితేరిన రావుగారి పరిశీలనా పరీక్షకు సూర్యం కథావస్తు వయ్యాడు.

వేలాది సంవత్సరాల తపఃఫలితంగా జంతు జాతిలో నున్న మానవజాతి పరిణతిచెంది నాగరికతా శిఖరాల నంటుకో బోతోంది. జంతువులకు ఆదిమానవులకు జీవితావసరములు రెండే రెండు ఉండేవి. అవి ఆహారము, వంశవ్యాప్తి. సృష్టి లోని వస్తువులను-అవి తమకన్న బలహీనమైన జంతువులు కావచ్చు, లేదా వృక్ష ప్రపంచానికి సంబంధించిన ఆకు లలములు, కాయలు పళ్లూ కావచ్చు; దొరికినవి దొరికినట్లుగా ఆది మానవులు, జంతువులు ఆహారంగా ఉపయోగించు కున్నాయి. కాని, ప్రపంచంలో ఏ ప్రాణికిలేని అద్భుతశక్తి మానవులకుంది. అదే ఆలోచనా శక్తి! ఆలోచనా శక్తి అధిక మైన కొద్దీ ఆదిమానవుడు పూర్తిగా మారిపోయాడు. ప్రకృ తితో పోరాటం ప్రారంభమైంది. అది అంతులేని పోరాటం. ఆ అనిరత పోరాటంలో ఓటముల్ని లెక్క-చేయకుండా మాన వత పోరాడింది. పోరాడ్తోంది. తత్ఫలితమే నేటి నాగరికత! అణువు మొదలు బ్రహ్మాండం వరకు సృష్టిలోని ప్రతివస్తువా మానవుని పరిశోధనకు, పరిశీలనకు గురయింది. పరమాణువు నుంచి పరమాద్భుతము సృష్టింపబడింది. ఇంతెందుకు? మాన వుడు ప్రకృతినే పరిహసించే దశకొచ్చాడు. కాని ఈ మహత్తర కార్యనిర్వహణ వెంటనే ఏ జంతువుకులేని దుష్టతత్వ మొకటి మానవుడు అలవరచుకున్నాడు. అదే ఆశ! సాటి మానవుడి కన్నా తను అధికంగా వుండాలనే వాంఛ!! ఇంకొకడికన్నా తను బలవంతుడుగా వుండాలి; ఇతరులంతా తన కాళ్ల క్రింది చీమల్లా వుండాలి!!! ఇది నిజంగా భయంకరమైన జబ్బు! ఈ జబ్బుతో మానవునిలోని మహత్తరమైన మానవత పూర్తిగా

మటుమాయమవుతోంది. పాశవికత యెంతో నయం - దాన వత మానవతను ఆవరిస్తోంది. తత్ఫలితంగానే జగత్కల్యాణాని కుపయోగించవలసిన నాగరికత వెర్రి తలలు వేస్తోంది. ఎడారుల్ని సస్యశ్యామలం చేయగల అణుశక్తి వినాశనానికి ఉపయోగపడుతోంది. తిమింగలం పెద్దచేపల్ని, పెద్దచేపలు చిన్న మీనాల్ని కబళించే విధానం మానవ సమాజంలో కూడా సర్వే సర్వత్రా వ్యాపించింది. ఈ దుష్టతత్వం మానవత్వంలో నుంచి యెంత త్వరగా మటుమాయమైతే అంతత్వరగా జగత్కల్యాణం సిద్ధిస్తుంది. లేకపోతే వినాశానికి బాటలు వేస్తున్నామని భావించుకోక తప్పదు!

అభివృద్ధికి రాదగ్గ యువకుడికి అవకాశాలు లేకుంటే తను ఆదరించి ఆదుకుంటున్నానని నారాయణరావుగారి విశ్వాసం! తన ధనంతో మరో **యువకుడి** జీవితాన్నే కొంటున్నాననే వూహా మాత్రమైన ఆలోచనకూడ తట్టలేదు ఆయనకు. ప్రతివాడికి వాడి వ్యక్తిగతమైన ఆశలు, ఆవేశాలు, జీవిత మార్గాలు తనలాగే వుంటాయని మరచిపోతూవుంటాడు మానవుడు. ఇది సహజంగా జరుగుతున్న విషయం! తను చేసే ప్రతి పనిలోను మంచితనము, నిస్వార్థత లేకున్నా వున్నట్టే వూహించుకొని వున్నతుడనని ఆనందించటము-కాని ఆ ఆలోచనల వెనుక దాగిన స్వార్థమసలు కనుపించనే కనుపించదు అతడి దృష్టికి. అనుక్షణమూ ఆత్మవంచన చేసుకుంటూ ఆలోచనలుచేసే మానవుల దృష్టి మారిపోయి వివిధ కోణాల్నుంచి తాము చేసే యోచనల్ని తరచి చూచుకుంటూ, ఆ ఆలోచనల వెనుకనున్న ఆశలు, ఆశయాలు తన కొక్కడికే

గాక యితరులకు కూడ యేమైనా లాభించగలవా లేక, తన సంతృప్తికోసం చేసే ఆ కార్యాలు యితరులను బంధించి వారిని పీడిస్తాయా యని తరచి భావించుకునే భావనా పటిమ మనుష్యుల కబ్బితే ప్రపంచ పరిణామం మరోవిధంగా తప్పకుండా మారిపోయి తీరుతుంది.

## అయిదవ ప్రకరణము

నెల దినాలు గడచిపోయాయి.

నారాయణరావుగారు గుంటూరు తాలూకాలోని ఒక చిన్న ప్రాజెక్టు నిర్మాణానికై కంట్రాక్టు తీసుకున్నారు. నాలుగు మాసాల్లో పని ముగిసిపోవాలి. నాలుగు లక్షల రూపాయలకు యెన్నికైన టెండర్ ఆయనది. అందువలన ఆయన ఆ పనిలోనే లీనమయినారు. రెండుమూడురోజులకోమాటు యింటికి రావటము, సౌదామినిని, సూర్యాన్ని చిరునవ్వులతోనే పలుకరించి తిరిగి తెల్లవారుతూనే వెళ్ళడమూ—ఇదీ ఆయన కార్యక్రమము. ఒకరోజు రాత్రి భోజనసమయంలో "నేను కూడా అక్కడికి వచ్చి..." యేదో అనబోయాడు సూర్యనారాయణ.

కాని మధ్యలోనే, రావుగారందుకొని చిరునవ్వుతో "ఏమిా ? ఇక్కడేం బావో లేదా ?" ప్రశ్నించారు.

"బావు లేక కాదండీ! వూరకే సోమరితనంగా కూర్చోవటం యెందుకని? పెద్ద వయసులో మీారే యిలా కష్టిస్తూ

వుంటే యువకులం పూరకే కూర్చోవటం...” నసిగాడు సూర్యం.

“నీ అవసరం కనుపించినప్పుడు నేనే చెబుతాలే. అబ్బాయ్!” అని “సరే! రాజారావేలా వున్నాడు? ప్రతిరోజూ వస్తూనే వున్నాడా?” ప్రశ్నించారు నారాయణ రావుగారు.

అవునని తలూపాడు సూర్యనారాయణ.

“అభివృద్ధికి రాదగ్గ వ్యక్తి. కాని వెనుకముందు చూచుకోవటమంటే యేమిటో తెలియదు. తాత్కాలికమైన వుద్రేక వుద్వేగాలతోను ఆవేశంతోను చిందులుత్రొక్కితే వుపయోగమేముందీ? ఆ ఒక్కటి సవరించుకుంటే మంచి భవిష్యత్తు వుందనటంలో సందేహంలేదు! బాగా వ్రాస్తాడు కూడా! రాజారావు నాన్న నాకెంతో ప్రియమైన స్నేహితుడుగా వుండేవాడు.” రాజారావునిగురించి తన అభిప్రాయాన్ని వెలువరించారు నారాయణరావుగారు.

సూర్యం యేమీమాట్లాడక వూకొడ్తూ కూర్చున్నాడు. సౌదామిని అందుకుంది. “ఈ వారం పత్రికల్లో రెండుకథలు వచ్చాయి నాన్నా అతనివి. నేను కూడా చదివాను. కాని అన్నీ విషాదాంతాలుగానే ముగుస్తాయి—ఛ! అలాకాకుంటే యెంతో బావుండేవి.” సౌదామిని రాజారావు సాహిత్యకృషిపైన తన అభిప్రాయాన్ని వెలువరించింది.

కూతురి మాటలకు చిన్నగా నవ్వుకున్నారు నారాయణ రావుగారు. సూర్యనారాయణవైపు చూస్తూ “నీ అభిప్రాయమేమిటబ్బాయ్?” చిన్నగా ప్రశ్నించారు.

"ప్రపంచంలో నూటికి తొంభై మందికంటే యెక్కువ గానే అనుకున్న ఆశయాలు నెరవేర్చుకోలేక కుమిలిపోతూ వుంటారు! అలాంటప్పుడు యదార్థదృష్టివున్న రచయిత వున్న వాస్తవాన్నే కళాత్మకంగా వివరించాలిగాని, వూరకే అంతా బావున్నట్లు, అందరు సుఖిస్తున్నట్లు వ్రాస్తే కళదృష్ట్యా నేను చెప్పలేనుగాని వాస్తవిక జగత్తుకు యేమీ మేలుచేసినవాడు కాలేడు. 'అద్దంలోలా ప్రజా జీవితాల్ని ప్రతిబింబింపజేసే వాడే నిజమైన రచయిత' అని ఎవరో పాశ్చాత్య విమర్శకు డన్నాడు. ఆ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను." మెల్లగా అన్నాడు సూర్యనారాయణ.

సౌదామిని సూర్యం మాటలు విని ముఖం ముడుచుకొంది. ఎదుటనున్నవారు తన అభిప్రాయాన్ని ఆమోదించక పోతే ఆమె యెప్పుడూ అలాగే తయారవుతుంది. ఆమే కాదు—గారాబంగా పెరిగిన పెద్దింటిబిడ్డలు యెవరైనా అంతే!

"బాగానే చెప్పావ్ సూర్యం! నిజమేమిటంటే..." యింకా ఏమిటో అనబోతున్నారు రావుగారు. కాని అంతలోనే సౌదామిని భోజనం మధ్యలోనే కంచంలో నీళ్ళుపోసి విసురుగా లేచిపోయింది. బిడ్డవె దారివైపు శూన్యంగా చూస్తూ రావుగారు "సహనమంటే యేమిటో యెరుగరు పిల్లలు!" సానుభూతిపూర్వకమైన విషాదంతో అన్నారు.

సూర్యం చిన్నగా నవ్వాడు.

"సూర్యం! సౌదామిని కళ్ళయినా సరిగ్గా తెరవకముందే మాతృమూర్తిని పోగొట్టుకుంది. బోలెడన్ని వ్యాపకాలతో సతమతమయ్యే నేనే ఆమెకు తల్లీ తండ్రి అయి పెంచాను

అమాయకురాలు. వెన్నలాంటి హృదయం. కాని దుడుకుతనం... వయసు వచ్చేకొలది దానంతటదే సర్దుకుంటుందనుకుంటాను.'' రావుగారు అన్నారు. గంభీరమైన ఆయన కళ్ళలో ఆ మాటలు చెబుతున్నప్పుడు కన్నీరు తొణికిసలాడినట్లు ఛాయా మాత్రంగా సూర్యనారాయణ గ్రహించాడు.

ఆనాటి సమావేశం అంతటితో ముగిసింది.

ప్రతిరోజూ సాయంకాలంపూట రాజారావు, సూర్యం కలిసి అలా వాహ్యాళికి వెళ్లేవారు. కృష్ణానది ఇసుక తిన్నెల మీద కూర్చుని ఏమేమో మాట్లాడుకునేవారు. కాదు... సూర్యం శ్రోత మాత్రమే. రాజారావే మాట్లాడుతూ వుండే వాడు. రాజారావులోని వున్నతమైన ఆశయాలు సూర్యాన్ని బాగా ఆకర్షించాయి. ఒక్కరోజు షికారు తప్పిందంటే ఏమో పోగొట్టుకున్నవాడిలా బాధపడేవాడు సూర్యం. కళలు, రాజకీయాలు, మానవ చరిత్ర క్రమంగా సాధించిన పురోగతి - అన్నీ రాజారావు మాటల్లో దొర్లిపోతూవుండేవి. రాజారావు సహవాసమే లేకుంటే సూర్యానికి అసలు కాలం గడిచేదే కాదేమో ననిపించేది. తినటమూ-ఏవైనా పుస్తకాలో, పత్రికలో చదవటము-ఏమీ తోచకుంటే అలా వెళ్లి బజారుల వెంట తిరగటము చేసేవాడు. సాయంకాలం యెప్పుడు వస్తుందా యని యెదురుచూడటం అతని కలవాటయింది.

సౌదామిని సూర్యాల మధ్య పరిచయం పరిచయం మాత్రంగానే నిలిచిపోయింది. కాని యెందుకో దృఢతరం కాలేదు. సౌదామిని గంటల తరబడి అలంకరించుకోవటము, కాలేజికి వెళ్లటము-గంపెడంతమంది స్నేహితురాళ్లని వెంట

బెట్టుకొని రావటము - ఇల్లు యిల్లంతా యాగీచేయటం - నిత్యమూ జరిగే కార్యక్రమాలు. సాయంకాలపూట స్వంతంగా కారు డ్రైవ్ చేసుకుంటూ ఒంటరిగా వెళ్ళేది. రాత్రి ఎనిమిది గంటలకుగాని తిరిగి రావటమంటూ వుండేదికాదు. ఇంట్లోవున్న పనిమనుషులందరు ఆ అమ్మాయి చూపులకే హడలి చస్తారు. విలాసవంతమైన విచ్చలవిడి జీవితాని కీవిడ బాగా అలవడింది కాబోలునని సూర్యం సౌదామిని గురించి తన మనసులోనే అప్పుడప్పుడు తలపోసేవాడు.

ధనవంతుల యిళ్లలో పెరిగే గారాబు బిడ్డలకు మొదటగా అలవడే విద్యల్లా అధికారం చలాయించుకోవట మనేది! తాము చెప్పిందే సబబు! ఇతరులు ఎదురు మాట్లాడరాదు! నచ్చకున్నా సరే తలూపాలి! ఇదీ వారు అలవరచుకునే మనస్తత్వం! అట్లని వారు దుర్మార్గులని కూడ చెప్పలేం! వారిలో దయాసానుభూతులుండవచ్చు; యితరుల కష్టాలను చూచి విలవిల్లాట్టంకూడ చేయవచ్చు! ఆపదలో నున్నవారిని ఆదుకోవాలనే జిజ్ఞాసకూడ వారిలో వుండవచ్చు; కాని, అవన్నీ అవతలి మనుష్యులు తమ అధికారానికి లొంగిన నాడే చేస్తారు, కనబరుస్తారు. సౌదామిని మనస్తత్వం కూడ సరిగ్గా అలాంటిదే!

సూర్యం వచ్చిననాడే తండ్రి చూచాయగా తన భావాన్ని ఆమెతో చెప్పాడు. విషయమంతా వింది సౌదామిని. బాగానే వుండవచ్చునని కూడ మనసు లోనే భావించుకుంది. అతనితో పరిచయం యితోధికం చేసు

కోమని తండ్రి చెప్పింది గుర్తున్నా ఆమె తనంతకు తాను అతనితో పలుమార్లు మాట్లాడటం, చనువుగా మెలగటం చేయలేకపోయింది. అతడు బుద్ధిమంతుడే కావచ్చు; అందమైన వాడేననటంలో కూడ సందేహం లేకపోవచ్చు; కాని ఆర్థికంగా అతనికి తనకు యెన్నో అగడ్తల లోతైన అంతరాలున్నాయి. తండ్రి అతనిమీద జాలిపడి వుద్ధరించాలని తీసుక వచ్చాడు. వెలుగులేని అతన్ని జీవితాన్ని కళకళలాడించాలని తన తండ్రి ప్రయత్నిస్తున్నాడు. అలాంటప్పుడు అతడే తన సాహచర్యం కోరేందుకు ముందడుగు వేయాలి; ఆరాటపడాలి. అప్పుడు తను ఆక్షేపణ లేకుండా మనసిచ్చి మాట్లాడుతుంది. ఇదీ ఆమె భావన. కాని సూర్యనారాయణ ప్రవర్తన ఆమెకు ఆశ్చర్యాన్నే కాదు వుక్రోషాన్ని కూడ తెప్పిస్తోంది.

ఏమీ కాబట్టని వాడిలా యెప్పుడూ నిర్లిప్తంగావుంటే వాడతను. తనతో మాటాడాలని ఆరాటపడవలసినవాడు తనే పలుకరించినా క్లుప్తంగా జవాబిచ్చి మిన్నకుండేవాడు. అందమైన తన కనుకొలుకుల్లోంచి నచ్చే చూపులకోసం తహ తహలాడవలసినవాడు తనంతకు తానై చూచినా తల వంచుకునేవాడు సూర్యం! సౌదామిని అహం పూర్తిగా దెబ్బ తింది. నెలనాళ్ల క్రితం తను సూర్యంమీద అల్లుకున్న కమనీయమైన మధుర భావనలన్నీ దూరమైనాయి. అతనికి తనకీ మధ్య యేదో నిగూఢశక్తి చైనా గోడలా అడ్డు నిలబడి అవాంతరాల్ని కలుగజేస్తోంది అని అనుకుంది. ఆ భావము ప్రబలిన కొద్దీ ఆమెకు తెలియకుండానే ఆమెలో సూర్యమంటే అసూయ, క్రోధం పెచ్చు పెరిగి పోయినవి. సూర్యనారా

యణ యేదైనా చదువుకుంటున్నప్పుడే ఆమె గదిలోనుంచి రేడియో మహా పెద్దగా గొడవ చేసేది. మధ్యాహ్నం వేళల్లో ఒంటరిగా పడుకొని ప్రశాంతంగా అతడేదో ఆలోచించుకునే టప్పుడే అవతలి గదిలోనుంచి కిలకిల నవ్వులు, కేరింతలు వెలువడేవి. బెల్లమున్నచోట యీగలు ముసరడంలో సందేహమేమీ లేదు. అందుకనే ఆమెకు కావలసినంతమంది స్నేహితురాళ్లు! మేడ ఒకటే కాదు—భవనం భవనమంతా వారి నవ్వులతోను కేకలతోను ప్రతిధ్వనించి పోయేది. యేడుకొండలు, వంటమనిషి నాయర్ ఆ గుంపులకు కావలసినవన్నీ సప్లయ్ చేయలేక విసిగిపోయేవారు.

సూర్యనారాయణ ఆమెలో క్రమానుగతంగా జరుగుతున్న మార్పుల్ని శ్రద్ధగా గమనించేవాడు. రావుగారిపైనవున్న అభిమానంవల్లనో, ఆ యింటిలో తనకుగల వింతస్థానంవల్లనో, మరే కారణంగానో గాని ఆమె చర్యలకు అతడు ఆవేశపడేవాడుకాదు. కోపం అంతకంటే వచ్చేదిగూడ కాదు. ఆమెను—ఆమె ప్రవర్తనను చూస్తూవుంటే అతనికి జాలి వేసేది. విచ్చలవిడిగా విహరించే ఆ మనస్తత్వం వెనుక దాగియున్న దుష్టశక్తులేవా యని ఆలోచించేవాడు. ఒక్కొక్కసారి ఆమె చేసే వుక్రోషపు పనులు, పిచ్చిచేష్టలు చూచి తనుకూడ నవ్వుకునేవాడు. ప్రపంచంలోని ప్రతి వ్యక్తిత్వానికి ప్రత్యేకమైన భావనలు, అభిప్రాయాలు, అభిమానాలు యేలా యేర్పడివుంటయా యని విస్తుపోయేవాడు. వ్యక్తులంతా ఒకటిగానే అవుపించినా వారిలో భిన్నతత్వాలు, విభిన్నమైన మనస్తత్వాలు యేలా యేర్పడుతవి అని ఆలోచించేవాడు.

ఈ మాసం రోజులనుంచికూడ సూర్యం రాజారావింటికి మరోమాారైనా వెళ్ళ లేదు. వెళ్ళవలసిన అవసరం కూడ రాలేదతనికి. ప్రతిరోజు ఆఫీసుగదిలో రాజారావుని పలుకరిస్తూ వుంటాడు. సాయంకాలాలు యిద్దరూ కలసి వాహ్యాళి కెళ్లారు. వారి మాటల్లో వ్యాపార గొడవలుకాని సాంసారిక విషయాలుకాని మచ్చుకైనా దొర్లేవికావు. వాటి కంటె ఉన్నతమైన అభిప్రాయాలు, భావనలు మాత్రమే దొర్లి పోతూ వుండేవి. కాని సూర్యం హృదయంమాత్రం యేదో తెలియని వెలితితో అప్పుడప్పుడు బాధపడేది. మరోసారి రాజారావింటికి వెళ్ళాలి. ఆ మొదటి చూపుల్లోనే తన్ను ఆకర్షించిన ఆమెను మరోమాటు చూడాలి! ఎవరామె? రాజారావు భార్యమాత్రం కాదని నిర్ణయించుకున్నాడు. మరి అతని సోదరో, మరదలో, మరెవరో అయివుండవచ్చు! ఈ ముప్పయ్ రోజులుగా ప్రతిరోజూ రెండు మూడు సార్లయినా ఆ అజ్ఞాత యువతి అతని దృష్టిపథంలో పడేది! ఆమెను గురించి ఆలోచించేవాడు సూర్యనారాయణ! కాని, ఆలోచించేందుకు ఏముంది? ఆమె యెవరోకూడ అతనికి తెలియదు! అయినా ఆలోచిస్తాడు. ఏవేవో మధురమైన వూహాసౌధాలు నిర్మించుకుంటాడు! గాలిమేడల్లో విహరిస్తాడు! తన వూహలు నిజమవుతాయా యని సందేహిస్తాడు; నిజం కావేమోనని బాధపడతాడు; తప్పకుండా తన కలలు ఫలిస్తాయని అంతలోనే విశ్వసించి భరవసా తెచ్చిపెట్టుకుంటాడు. ఒకొ్కక్క సారి తనంతకుతానే ఆశ్చర్యంతో ఆలోచిస్తాడు. ఏ అజ్ఞాత శక్తి తన్నింత లోబరచుకుంది? ఒకనాటి రెండు క్షణికాల

చూపులకే తనింతగా యెందుకు బాధపడాలి? ఆమెకి తనకి సంబంధం యేమిటి? ఏమిటీ వ్యూహాల తీరు తెన్నులు? కాని, అతని హృదయానికి ఆ ప్రశ్నలకు జవాబులు లభించవు! ప్రశ్నలు ప్రశ్నల రూపంలోనే తిరిగి ప్రత్యక్షమవుతవిగాని జవాబు లందవు. విధి విలాసంమీద అతనికి నమ్మకం లేదు; నమ్మకం వుంది. హేతువాదాన్ని అతడు విశ్వసిస్తాడు; విశ్వ సించలేడు. మానవ జీవితాలు కీలుబొమ్మలు! తెర వెనుకనుండి ఒక బలీయమైన శక్తి ఆ బొమ్మల్ని ఆడిస్తుంది. వివిధ భావ భంగిమలు ఆ బొమ్మలు స్వతహాగా తెచ్చిపెట్టుకున్నవిగావు. తెర వెనుకవుండే శక్తి యిచ్ఛాయిచ్ఛాలపైనే అవన్ని ఆధార పడి వుంటాయి అని అనుకుంటాడు సూర్యనారాయణ. కాని వెంటనే తన అభిప్రాయాలు పొరబాటేమోననే సందేహంలో పడి ఆలోచనా ప్రపంచంలోపడి తల మునుకలవుతాడు.

ఏది యేమైనా సరే-ఆమె సాహచర్యం తనకు తప్ప కుండా కావాలి. లేకుంటే తన జీవితమంతా యేదో తీరని వెలితితో బాధ పడక తప్పదనుకున్నాడు సూర్యం! నారాయణ రావుగారు తన్నాహ్వానించినప్పుడు తను అమితాశ్చర్యంతో 'ఏమిటా కారణం?' అని విస్తుపోయినా- యిప్పుడు సూర్యాని కర్థమైంది ఆయన ఆప్యాయతలోని అంతరార్థం! రావుగారి దృష్టిలో అది త్యాగమే కావచ్చు, కాని తన దృష్టిలో అది పూర్తిగా తన వ్యక్తిత్వాన్ని అమ్మకానికి పెట్టడమే! అందు లోను సౌదామిని ప్రవర్తన, మనస్తత్వము గమనించిన కొద్ది అతనికి అక్కడ వుండటమే ముళ్ళపొద మీద వున్నట్టుంది!

తను మిన్నకుండా వుండి, రావుగారు తన్నాధారం చేసుకొని యింకా యేమేమో వ్యూహాసౌధాలు నిర్మించుకునేటట్టు జేసి ఒక్కసారిగా ఆయనకు ఆశాభంగం కల్గించటం క్షమించరాని నేరంగా తన దృష్టికి తనకే అవుపిస్తోంది. కాబట్టి వీలయినంత త్వరలో యిక్కడినుండి తప్పుకోవాలి! ఆలాచేస్తే తనెన్నో కష్టాలపాలు కావలసి వుంటుంది. అయినా పర్వాలేదు. వ్యక్తిత్వాన్నే పణంగాపెట్టి జీవితాన్ని చూస్తూచూస్తూ బానిస బంధనాల్లో చిక్కుకునేటట్లు చేయటానికంటె కష్టాలు యెక్కువేంగావు. అభిప్రాయాల్ని చంపుకొని ఆనందించే కంటే అభిప్రాయాల నిర్వహణకోసం దుఃఖాన్ని వరించినా మంచిదే!

అసలు దుఃఖమూ, ఆనందమూ అనే యీ పదాలకు వుండే అర్థాలేమిటి? ఒకరి కానందమైనదే మరి ఒకరికి దుఃఖ కారణం కావచ్చు! అందమైన మృగం వలలో పడ్డనాడు వేట గానికి పర్వదినం కావచ్చు. కాని, బెదరిన ఆ విశాల నయనాల నుండి బానిసత్వంలో బంధింపబడి యున్నానే అనే చింతతో అశ్రువులు కార్చే ఆ జింకపిల్ల మాటేమిటి?—అనుకుంటేను, ఆలోచిస్తేను అన్నీ ఆశ్చర్యంగానే వుంటాయి. ఏవి సత్యాలో యేవి కావో తెలుసుకోవటం బలే కష్టమైన విషయం! కాబట్టి కష్టాల పాలవుతానని అనుకోవడం అసంగతమైన విషయం అని అనుకున్నాడు సూర్యనారాయణ.

ఆ రాత్రి యెడతెగని ఆలోచనా ఫలితంగా రెండు నిర్ణయాల కొచ్చాడు అతను. మొదటిది, నారాయణరావుగారి శెలవు పుచ్చుకొని గారి భవనాన్ని వదలటం. రెండవది, తన

మనసును పూర్తిగా ఆక్రమించిన రాజారావింటిలోని యువతిని వివాహమాడి తీరాలని నిశ్చయానికి రావటమూను.

## ఆరవ ప్రకరణము

—

సిగరెట్ పొగలతో చిరుమేఘాలు కల్పించబడ్డాయి. పొగ వుంగరాలు వుంగరాలుగా తిరుగుతూ గవాక్షంగుండా వినీలాకాశంలోకి లీనమవుతోంది. గోడలకుండే సినిమా తారల చిత్రాలకు ధూపమేమో అది! సిగరెట్ పీకలు, కాగితాల ముక్కలు గదంతా అలుముకొని వున్నాయి.

ఈజీఛేర్‌లో కూర్చున్న శేఖర్ ఫ్యాషన్‌గా పొగ వదులుతూ అరమోడ్పు కనులతో "అయితే కథ ఎంతవరకు వచ్చిందేమిటి?" ప్రశ్నించాడు కుమార్‌ని.

గదిలో మరో రెండు కుర్చీలున్నా, కూర్చుంటే బట్టల ఇస్త్రీ మడతలు నలుగుతాయేమోనని భయపడే కుమార్ నిలుచునే వున్నాడు. అప్పుడప్పుడు గదిలో అటూ యిటూ పచారు చేస్తున్నాడు.

కుమార్ స్నేహితుని ప్రశ్నతో పచారు చేస్తున్న వాడల్లా టక్కున నిలబడ్డాడు. "ఏమిటి!" అన్నట్లు తన పెద్ద కనుగ్రుడ్లు స్నేహితునికేసి త్రిప్పి కళ్ళతోనే ప్రశ్నించాడు.

శేఖర్ పక పకా నవ్వాడు.

"ఏమిట్రా వెకిలి నవ్వు - నువ్వూనూ?" ప్రశ్నించాడు కుమార్.

శేఖర్ నవ్వుతూనే "భాయీ! నేనొక పుస్తకంలో చదివిన జ్ఞాపకం వుందోయ్! వాడెవడో అంటాడు 'ప్రేమకు ప్రధాన లక్షణం పరాకు' అని. నిజమేనని నిన్ను చూస్తూ వుంటే అవగతమవుతోంది. భేష్!" చేతులు గ్రుడ్లూ తిప్పుతూ మరీ అన్నాడు శేఖర్.

"ఏడిశావ్! పుస్తకాల్లో విషయాలు గుర్తుకొచ్చే క్రొత్తరోగమెప్పటినుంచి ప్రారంభమయిందిరోయ్! అన్నట్లు నీవడిగేదేమిటి?" కుమార్ హుందాతనంతో అడిగాడు.

శేఖర్ చప్పరిస్తూ "ఆ...ఏముంది? తమ ప్రేమ గాథ ఏ దశలో ఉందీ యని జిజ్ఞాస పడుతున్నాడు యీ మిత్ర రత్నం." తిరిగి నవ్వాడు.

కుమార్ మామూలుగా నున్న తన ముఖాన్ని సీరి యస్‌గా పెట్టి "కథ మాంఛి క్లయిమాక్స్‌లో పడుతోందిరా. విలన్‌గాడుకూడ దాపురించాడు. అయినా విజయం మనదే లేయనే విశ్వాసం వుంది."

ఈజీఛేర్‌లో పడుకున్నవాడల్లా కుమార్ మాటలతో లేచి కూర్చున్నాడు శేఖర్. "ఆ..." పెద్దగా వూకొట్టి "ఏది ఒక సిగరెట్ యిలా పారేయ్!" చేయి చాచాడు.

జేబులోని గోల్డుఫ్లాక్ సిగరెట్ పెట్టె తీసి శేఖరం చేతికిచ్చాడు కుమార్. శేఖరం తను సిగరెట్ ముట్టించుకొని కుమార్ చేతికి ఓ సిగరెట్ యిచ్చి తను కాల్చుతున్న నిప్పు పుల్ల అందించాడు. ఇద్దరూ తాపీగా పొగ వదుల్తున్నారు. ఆలోచనా ప్రవాహాలు పొంగిపోతున్నవారిలా పోజులు పెట్టారు!

"ఒరేయ్!" హటాత్తుగా అన్నాడు శేఖరం.

"ఆఁ..." తలెత్తి చూశాడు కుమార్.

"విలన్‌గాడు రంగంలో ఎవరి ఆసరాతో ప్రవేశించాడురా?" ఏదో రిసర్చి చేయబోయేవాడిలా అడిగాడు శేఖరం.

"పోరా! ఏదో ఐడియా యిస్తావేమోనని నేను ఆశపడ్డాను. ఇంతకీ యేం చచ్చు ప్రశ్న వేసావురా!" నిరాశగా మూల్గినాడు విరహజీవి కుమార్.

"అరే నాయనా! రెఫరెన్సు టు ది కాంటెస్టురా! వివరాలు తెలుసుకోకుండే విషయాలేలా ఆలోచిస్తావనుకున్నావ్? కాని...చెప్పు?" మిత్రుడ్ని ఆదుకునేవాడిలా జాలి చూపాడు శేఖర్.

"సాక్షాత్తూ కథానాయిక తండ్రే ప్రవేశపెట్టిన గ్రహంరా అది. లైబ్రరీలో రెండుసార్లు చూచానుకూడ. వాడు - వాడి శీవి, బాగానే వున్నాడురోయ్! ఇక్కడెవరూ లేరని ఎక్కడో రాయలసీమనుండి పట్టుకొచ్చాడు వీడ్ని ఆయనగారు." కుమార్ కళ్ళలో నీరు గిర్రున తిరిగింది. శేఖరం లేచి మిత్రుని కన్నీళ్ళను తన చేతిగుడ్డతో తుడిచాడు.

"గురూ! ఇది ట్వెంటియత్ సెంచరీ అని మరచిపోబాక! కథానాయిక అంగీకరించిందా- దాని ఫాదర్ కాదు వాడ్ని పుట్టించిన భగవంతుడుకూడ ఏమీ చేయలేడు. నీవు చింతించటం అనవసరం! ఇంతకీ ఆవిడ ఏమంటుంది?" శేఖరం బుజ్జగించాడు.

"ఇంకా ఆ ప్రస్తావన రాలేదురా! ప్రతిరోజూ సాయం కాలం షికారుకు వెళ్ళేటప్పుడల్లా యేదినానికాదినం ఈ నాడు ప్రస్తావించి తీరాలనుకుంటా. - కాని..."ఆగాడు కుమార్.

"కాని...అంతలోనే గుండెల్లో కెనేడియన్ రైలింజన్లు పరుగెత్తా యేమిటిరా! నిజం చెబుతే నీవు కోపగించుకుంటావు గాని కథా నాయకునికి సహజంగా వుండే ధైర్యసాహసాలు నీలో లోపించాయిరా! నెలన్నరనుంచి గ్రంధంలో దిగినా యింకా ప్రథమ ఘట్టమే యేమిటిరా నీ బొంద!" శేఖరం సానుభూతి, గర్వం కలిసిన కంఠంతో పలికాడు.

కాలుస్తూవున్న సిగరెట్ విసరి పారేశాడు కుమార్. ఎర్రటి అతని ముఖం మరింత ఎర్రనైంది. "ఎంత మాటన్నావ్ రా!" అన్నాడు. అంతకంటె మరింక మాట్లాడేందుకు అతని నోరు పెకిలిరాలేదు. ఇంతలోనే వీధిలో కారు హారన్-'భయ్ భయ్' మంది. పీకలవరకు వచ్చిన కోపాన్ని, హాలాహలాన్ని గొంతుకలోనే నిలుపుకున్న గరళకంఠునిలా దిగమ్రింగు కున్నాడు కథానాయకుడననుకుంటున్న కుమార్ ! చెదరిన వెంట్రుకలను సవరించుకొని, అద్దంలోకి చూస్తూ ఒక చిరునవ్వు నవ్వి "వస్తారా! సౌదామినీదేవి వచ్చింది" అంటూ తుర్రున బయటకు నడిచాడు కుమార్.

"ఒరేయ్! కథానాయకుని పేరు ప్రతిష్టలు నిలపాలీ దినమైనా..." అన్న శేఖరం మాటలకి తలుపు దాటిపోతూ వున్న కుమార్ "చూస్తావ్‌గా" అంటూనే వెళ్ళిపోయాడు. కుమార్ మిత్రుడు శేఖర్ మరో సిగరెట్ అంటించి. పొగ పోయేవైపుకే చూస్తూ యెందుకో చిన్నగా నవ్వుకున్నాడు.

సాయంత్రం ఆరు గంటలు కావస్తోంది. కృష్ణానదీ జలాల్లోపడ్డ నీరెండ మిలమిలా మెరిసిపోతోంది. ఎన్నోనాళ్ళ నుండి ప్రియురాలి యెడబాటు సహించలేక సహిస్తూవుండి కట్టకడపట ఆమెను కలుసుకోనబోయే ప్రేమికుడిలా ఛాయా నాథుడు పడమటి కొండచాటుకి పరుగెత్తుతున్నాడు. సూర్య నారాయణ, రాజారావు కృష్ణ ఆనకట్టమీద మెల్లగా నడుస్తు న్నారు. ఆనకట్ట ప్రక్కనే వుండే రోడ్డుమీదనుంచి ఒక కారు హారన్ 'బాయ్' మని అనిపించుకుంటూ పోతోంది. అప్రయ త్నంగా యువకులిద్దరు కారువైపు చూచారు. డ్రైవర్ స్థానంలో కూర్చున్న సౌదామిని, సూర్యనారాయణల కళ్ళు కలుసుకున్నాయి. వెనుక సీటులో కూర్చున్న కుమార్ సూర్యనారాయణని పుణుకుపుణుకున చూచి గబాల్న తల వంచుక కూర్చున్నాడు. గుంటూరు రోడ్ కేసి కారు వెళ్ళి పోయింది.

రాజారావు, సూర్యం - యిద్దరూ సౌదామినిని చూచారు. అంతే - వారామెను గూర్చి అప్పుడైనా యేమి మాట్లాడుకోలేదు. కృష్ణవేణీ నదీ తరంగాలపైనుంచి వచ్చే మలయమారుతాన్ని ఆస్వాదిస్తూ, ఆలాగే ఆనకట్టమీద పచార్లు సాగిస్తున్నారు. కాని, సూర్యం మనసులో మాత్రం యేవేవో భావావేశాలు పొంగి పొర్లుక వస్తున్నవి. మాసం రోజులకుపైగావుండే పరిచయంతోను, సాన్నిహిత్యంతోను అతడు సౌదామినీ మనస్తత్వాన్ని బాగా అర్థం చేసు కున్నాడు. సౌదామిని గర్విష్టి కాని అమాయకురాలు. ఆమె తనకు అన్నీ తెలుసునని అనుకుంటూ వుంటుంది కాని యేమీ

యెరుగని ముగ్ధ. జీవితంలో యే విషయాన్ని బరువుగా తీసు కోదు. ఆమె చూపుల్లో అన్నీ చులకనే! ఆమె కసలు పరి శీలనా దృష్టంటూ ఒకటి వుందా అని అనిపిస్తుంది. పిల్లలాడు కునే ఆటల్లోలాగే ఆమె అనుక్షణం జీవితంతో చెలగాట మాడుతుందనటంలో సందేహ మేమాత్రమూ లేదు!

గాలి విసురుగా వీస్తోంది. ఆనకట్టవద్ద ప్రవాహం వుర వడిగా ప్రవహిస్తోంది. విశాలమైన ఆ నదీప్రాంతమంతటా గాలిలో 'హోరు' వినిపిస్తోంది. సూర్యం రాజారావు లిద్దరూ ఆనకట్టమీద నడుస్తూ సీతానగరంవైపు నడచి నది కావలి గట్టున ఒక పెద్ద బండరాతిమీద కూర్చున్నారు. సంజె వెలు గులు నీటిలో వింత వింతగా ప్రతిఫలిస్తున్నాయి. పట్టణం లోని రొద దూరంనుంచి కలలో వినిపించినట్లుగా అస్పష్టంగా వినిపిస్తున్నది. దూరంగా పడమటి గాలికి లంగరెత్తిన పడవ వయ్యారంగా తేలిపోతోంది.

"మిస్టర్!..." అన్నాడు సూర్యనారాయణ మౌనాన్ని భంగం చేస్తూ.

సంజెవెలుగులలో తళ తళలాడే నీటి కెరటాలవైపు బారులు బారులుగా పోతున్న పక్షులవైపు చూస్తూ కూర్చున్న రాజారావు తలెత్తి సూర్యంవైపు చూచాడు.

సూర్యం సూటిగా మాట్లాడలేక పోతున్నాడు. ధైర్యాన్ని పుంజుకొని చిన్న పొడిదగ్గు దగ్గి "మీ సలహా కావాలండీ!" అన్నాడు.

రాజారావు మెల్లగా నవ్వాడు. ఆ నవ్వులో సూర్యం తన్నే విషయంలో సలహా అడిగేది ముందుగా తెలుసుకున్నట్లుగా సూచితమైంది. "సూర్యం! ఆశయాలు, ఆవేశాలు వుండటం పొరబాటనను. కాని..." ఆగాడు రాజారావు.

రాజారావు నోటినుంచి వెలువడే మాటలకు ఆత్రుతతో కాచుక కూర్చున్న సూర్యనారాయణ అతడు అర్థోక్తిలోనే ఆగటం చూచి కొద్దిగా కించబడ్డాడు. అదోమాదిరిగా రాజారావువైపు చూస్తూ "కాని..." అందుకున్నాడు.

రాజారావు తిరిగి చిన్న మందహాసంచేసి 'ఆవేశం మోతాదు మించుతే వెర్రిగా కనుపిస్తుందేమో! ఆచరణలేని ఆవేశం యెందుకు కొరగాదుకూడ—ఆనక చింతించేందుకు తప్ప! చుట్టూవుండే వాతావరణాన్ని తనకు తన ఆశయాలకు అనుకూలంగా మలచుకోవడానికి కృషి చేయటం బహు కష్టమైన విషయం. కష్టమేమిటి–అదో పోరాటంగూడ! ఆ పోరాటంలో పణంగా పెట్టవలసింది జీవితాలనే! అందుకెంతో ఆత్మ సాహసాలు కావలసి వుంటాయి. అయినా విజయం సంశయాస్పదమే. మన మెదురు తిరిగిన సమాజపు రథ చక్రాల క్రిందబడి నజ్జు నజ్జుగా నలిగిపోవచ్చు కూడ. పోతే మరొహటి; చుట్టూవుండే వాతావరణానికి అనుగుణంగా మనమే మారటం – అది చాల సులువైంది. ఏ బాధ బాదర బందీ లేనిదీనూ. అల్లాంటి జీవితం ఒడిదుడుకులు లేకుండా సాఫీగా ప్రవహించే చిరుకాలువలాంటిది. అటు పోట్లు అసలే ఉండవు. మార్పులేని దసలు." ఆగాడు రాజారావు.

ప్రపంచాన్నంతా చీకటి తెరలు అలుముకుంటున్నవి. పట్టణంలోని లైట్లకాంతి మిణుకు మిణుకుమని అవుపిస్తోంది. రాజారావు సిగరెట్ అంటించి పొగ తాపీగా వదులుతూ సూర్యంవైపు పరిశీలనగా ఒకమాటు చూచి తిరిగి అన్నాడు. "మధ్యే మార్గమే లేదు సూర్యం! బాగా ఆలోచించు. ఏదో ఒక విధానాన్నే నిర్ణయించుకో. మధ్యలో తారు మారు కావటం చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకున్నట్టు ఉంటుంది. పర్వాలేదు. రావుగారు మంచివారే! ఆ వర్గం వారితో పోలిస్తే ఎంతో మానవత్వం గలవాడేనని అనిపిస్తూంది. ఇందులో నా సలహా...మరేం చెప్పను?" ప్రశ్నించి సూర్యం ముఖతా జవాబు వినేందుకు చూశాడు రాజారావు.

రాజారావు మాటలు వింటున్న సూర్యనారాయణ అమితాశ్చర్యాన్ని పొందాడు. రాజారావు మంచి తెలివైన వాడని తాను మొదటినుంచి అతనిని యెరిగివున్నా, యింత సునిశిత హృదయుడని గ్రహించలేకపోయాడు. సలహా అని తను అనీ అనటంతోనే తన మనోగతాభిప్రాయాలనన్నింటిని పొల్లుబోకుండా ఆకళింపు చేసుకున్నట్లు మాట్లాడాడు. సూటిగా గాకుండా మర్మగర్భితంగా, హృద్యమంగా, అతి సున్నితంగా, ఏవో మామూలు విషయాల్లా యెంత బాగా సలహా యిచ్చాడు రాజారావు. సూర్యనారాయణకు రాజారావుపైగల గౌరవం యీ సంఘటనతో రెట్టింపయింది. పుస్తకాల్లో మానవుల మనస్తత్వాలు చూస్తూనే గ్రహించే మహాత్ములుంటారని అతను విన్నా నమ్మేవాడుగాదు. కాని నేడు తన యెదుట — మామూలు వ్యక్తి — అందులోను

లోకం దృష్టిలో ఏమీ ప్రత్యేకత కనుపించని వ్యక్తి మహాత్ము డులా గోచరించాడు. రాజారావుపైని గౌరవంతో సూర్యం హృదయం పరిపూర్ణమైనట్లయింది. ఆనందంతో అతని కళ్ళు సజలములైనవి. అల్లాంటి వ్యక్తితో స్నేహం కలియటంచేత తన జన్మ సార్థకమైందనుకున్నాడు సూర్యనారాయణ.

ఒక్కసారిగా సూర్యం రాజారావు రెండు చేతులు తన చేతుల్లోకి తీసుకున్నాడు. సూర్యం చర్యతో విస్తుపోయి విస్ఫారితనయనాలతో అతనివైపుకు చూచాడు రాజారావు.

"మీరు...మీరు..." సూర్యనారాయణకు మాటలు తడబడ్డాయి. నంగి నంగిగా అన్నాడు.

"ఏమిటి?" రాజారావు ప్రశ్నించాడు.

"నిజంగా మీరు మహాత్ములు! కోహినూరు వజ్రం లాంటి మిమ్మల్ని గుర్తించలేని, నిర్లక్ష్యంచేసే యీ పాడు సంఘం క్షమార్హమయిందిగాదు" అన్నాడు సూర్యనారా యణ.

రాజారావు విషాదంగా ఒక చిరునవ్వు నవ్వి "చీకటి తెరలు అలుముకుంటున్నవి. వెళ్దాం పద!" అన్నాడు. మిత్రు లిద్దరూ మౌనంగా పట్టణం దిశకు నడిచారు.

చుట్టూవుండే దుష్టత్వపు ఛాయలు పడకుండా నిర్మ లంగా స్ఫటికంలా ఉన్న సూర్యనారాయణ మనసును గురించీ, అతనిలోని అమాయకత్వాన్ని గురించి రాజారావు తనలో నే తలపోసుకుంటూ ముందుకు అడుగులు వేశాడు.

# ఏడవ ప్రకరణము

---

"సౌదామినీ!"

సౌదామిని తలెత్తి కనురెప్పలల్లారుస్తూ చూచింది. కుమార్ మాట్లాడలేక నీళ్లు నములుతున్నట్లున్నాడు.

"ఏం?" అన్నట్లు ఆమె కళ్ళే అడిగాయి అతడ్ని.

"సౌదామినీ! ఎన్నో రోజులనుంచి అగ్నిపర్వతంలా నాలో దాచుకున్న భావాన్ని మరింక వెళ్ళగక్కకుండా బ్రతుకలేను. నేను... నేను..." అన్నాడు కుమార్.

ఆ చల్లటి సాయం సమయానకూడ అతని ముఖమంతా స్వేదబిందువులతో నిండిపోయింది. అతనికి మాటలు తడబడుతున్నవి. ఉద్రేకము భయము సిగ్గు సమపాళ్లతో అతని ముఖంలో తాండవిస్తున్నవి.

కుమార్ మాటలకు సౌదామిని ఆశ్చర్యపడలేదు. ఇలా జరుగవచ్చునని వూహించిందికూడ! ఆమెకూడ అయోమయంలో వుంది. భిన్నమైన భావాలు ఆమె మెదలోకూడ మెదలాడుతూనే వున్నాయి. ఆమె హృదయం నిండుగా సూర్యనారాయణ ఒకవైపు, కుమార్ మరోవైపు ఆక్రమించుకున్నారు. ఒక క్షణం సూర్యనారాయణను తను హృదయస్ఫూర్తిగా ప్రేమిస్తున్నానని అనుకుంటుంది. కాని, మరో క్షణంలోనే కుమారే తన వూహల్లో అనిరతమూ మెదలాడే ప్రియుడేమోనని భ్రమిస్తుంది. కుమార్‌లా యింత గాఢంగా గాకున్నా ఛాయామాత్రంగానైనా సూర్యనారాయణ తన్ను

ప్రేమిస్తున్నట్లు అవుపిస్తే తను తర్వాత కుమార్ పేరును తలంచనుకూడ తలంచదు. ఆమె హృదయం కల్లోల సాగరంలా వుంది. పున్నమినాటి వెన్నెల ప్రసరిస్తే చాలు-పొంగుతుంది వుదధి. కాని వెన్నెలే కరువైంది. ఉరకలు వేసే అలలు వుత్సాహ ప్రోత్సాహాలు లేక వువ్వెత్తుగా లేవబోతూకూడ యిట్టే అణిగిపోతున్నాయి.

కుమార్ తలవంచుకునే కూర్చున్నాడు. "నేను... నేను..." అనటంతోనే అతను తను చెప్పవలసిందేమిటో చెప్పాననే భావించుకున్నట్టుంది, సౌదామిని జవాబుకోసం నిరీక్షిస్తున్నవాడిలా వున్నాడు. ఫుణుకు ఫుణుకున అప్పుడప్పుడు ఆమె చూపులు నిగిడిస్తూ వున్నాడు. ఆమెనుంచి రాబోయే మాటలకు వేయిచెవులు పెట్టుకొని వినాలనే ఆత్రుత కనబరుస్తున్నవాడిలా వున్నాడు. అతని గుండె దడదడ కొట్టుకుంటోంది. భగవంతునిపై యేనాడు విశ్వాసం లేని అతడు "భగవాన్! ఆమోదకరమైన ప్రత్యుత్తరం రప్పించు"అని ప్రార్థించుకున్నాడు.

క్షణక్షణమూ ఒక యుగంలా జరుగుతున్నట్లు అవుపిస్తోంది. జీవితకాలం క్షణంపాటు ఆలాగే యేదో అజ్ఞాత శక్తితో ఆదేశింపబడినట్లు ఆగినట్లుంది. చల్లగాలి మెల్లగా వీస్తోంది. శేష్ మహల్లో పెట్టిన రికార్డులు సన్నగా వినిపిస్తున్నవి.

"సౌదామినీ!"

నిశ్శబ్దం భంగమైంది.

ప్రశాంతత పారిపోయింది.

సౌదామిని వినీల కనీనికలు విచ్చుకున్నాయి. బరువుగా వ్రాలుతున్న కనురెప్పల్ని అల్లల్లాడుస్తూ ఆ వెన్నెల్లో అతని వైపు చూసింది. తటిల్లత తళుక్కుమని మెరిసినట్లయింది. "ఇక వెళ్దామా!" అంది ఆమె లేచి నిలబడుతూ.

ఆతురతతో గూడు కట్టిన అతని ముఖం అదోమాదిరి అయింది. ఒక్క విసురున లేచి తన రెండు చేతులతోను ఆమె చేతులు పట్టుకొని ఆమె కళ్లలోకి సూటిగా చూస్తూ ఏదో మాట్లాడ బోయాడు. కాని...

సౌదామిని దేహమంతా యెందుకనో జలదరించి పోయింది. హటాత్తుగా తనకు తెలియకుండానే ఆమె భయ విహ్వల అయింది. అతను తన రెండుచేతులు బలంగా పట్టు కొని వుంటేను, అతడు సూటిగా తన కళ్లకి చూస్తూవుంటేను ఆమె దేహమంతటా పాములూ జెర్రులూ ప్రాకుతున్నట్లు బాధపడింది. ఏదో అసహ్యం తీవ్రంగా ఆమెను ఆవరించు కొన్నట్లనిపించింది. ఆమె దాదాపు గజగజా వణికిపోయిందని చెప్పవచ్చు.

అప్రయత్నంగానే ఆమె అతని రెండు చేతుల్ని విసరి కొట్టింది!

అతడు తుళ్లిపడ్డట్టయి తిరిగి తేరుకున్నాడు.

దీనంగా సౌదామిని ముఖంలోకి చూశాడు.

ఆమె ముఖం పాలిపోయివుంది. ఆమె కళ్లలో శూన్యత్వం నడయాడుతూ వున్నట్టుంది.

క్షణం క్రిందటి అతని ఆనందానుభూతి మట్టిని కలసి నట్లు బాధపడ్డాడు కుమార్.

పాలనురుగులాంటి స్టైర్‌మాస్టర్ కారు వెన్నెల్లో మెరిసిపోతోంది. ఉలుకూ పలుకూ లేకుండా వారిద్దరూ కారు వైపు నడచి కారులో కూర్చున్నారు. కారు కదిలింది.

స్పీడో మీటర్ ముప్ఫయవ అంకె చూపుతోంటే కారు ఆ వెన్నెల రాత్రిని చీల్చుకుంటూ దూసుకుంటూ వెళ్ళి పోతూ వున్నట్లుంది. కాని...కారులో కూర్చున్న యిద్దరు వ్యక్తుల అంతరాల్లో యేవేవో భావాలు తీవ్రంగా సంఘర్షణ చెందుతున్నట్లున్నవి.

స్టీరింగ్‌ను చేతులు మాత్రమే తిప్పేస్తున్నవి. బ్రేకుల మీద కాళ్లపాదాలు మాత్రమే వున్నాయి. కాని, సౌదామిని మనసంతా ఆలోచనలతో నిండిపోయింది. ఎదురుగా వుండే అద్దంలో ఆమెకు రెండు ప్రతిబింబాలు ఒకదాని సరసనే మరొ కటి కనుపిస్తున్నాయి. ఒక బింబంలో నిర్లిప్తతవున్నా కళ్లలో యేదో కాంతి వుజ్వలంగా తళతళలాడుతోంది. మరో బింబం లోని ముఖం ఉజ్వలంగా ఆడంబరంగా కనుపించినా ఆ కళ్లలో యేదో అర్థం తెలియని అజ్ఞానం నిండుగా ఉన్నట్లుంది. ఒక ప్రతిబింబంలో చిరునవ్వు కనుపించీ కనుపించనట్లే వున్నా కను పడ్డ ఆ క్షణంలోనైనా యేదో వింత వెలుగు రేఖలాంటిది పారాడుతున్నట్లుంది. మరో ప్రతిబింబంలో చిరునవ్వేగాదు నవ్వే కనుపిస్తోంది. ఆ నవ్వులో కొద్దిగా వెకిలితనము, మరో కొద్దిపాళ్లు మెరుపుగా యేదో జుర్రుకోవాలనే ఆకాంక్ష ఆత్రుత కనుపిస్తున్నది. దగ్గరగా మరింత సమీపంగా పోవా

లనుకునే వారికి దూరం కానటం, అనుకోకుండానే అసహ్యాం చుకునే వారిని దరిచేరటం యాదృచ్ఛికంగానే జరుగుతూ ఉంటుందా? ఆలోచిస్తోంది సౌదామిని. కుమార్ చర్య ఒక్కసారిగా చల్లటి వడగళ్ల నీళ్లను యెవరో నెత్తిన దిమ్మరించినట్లుగా హటాత్తుగా ఉలిక్కిపడేటట్టు చేయకున్నా యెందుకో వింతమైన ఆలోచనల్ని లేపుతోంది ఆమెలో! కుమార్ తన్ను తన అందాన్ని అంతకంటె మిక్కుటంగా తన ధనాన్ని ప్రేమిస్తున్నాడని ఆమెకు తెలుసు; ఏనాటైనా నగ్నంగా తన కాముకత్వాన్ని బయట పెడతాడనికూడ ఆమె యెరుగును. కుమార్ విషయంలో ఆమె యిష్టా యిష్టాలు ఆమెకే తెలియవు! అయినా యెందుకో ఆలాంటి సంఘటనను చూడాలని ఆమె అంతరాంతరాల్లో ఒక అంతరంగం వాంఛించింది! తీరా సమయమొచ్చిన తర్వాత ఆలా వాంఛించిన ఆ అంతరంగం అంతర్థానమైంది.

స్త్రీ పురుష శిశు భేదం లేకుండా ప్రతి వ్యక్తిలోను హృదయంలో అతి సున్నితమైన 'కాన్షియన్స్' ఒకటుంటుంది. దీనినే మనం 'మనసులోని మనసు' అని పిలవవచ్చు. మనిషికి దిక్సూచిలాంటిది ఆ మనసులో మనసు. తాత్కాలికంగా మనసులో జనించే ఆవేశాలను ఆలోచనలను అది అనిరతము క్రమబద్ధం చేసేందుకు ప్రయత్నిస్తూ ఉంటుంది. తర్జనితో బెదిరించినట్లు ఆ మనసులోని మనసు 'మంచి' వైపుకు మెల్లమెల్లగా దారి చూపుతూ మనిషిని అటువైపు మళ్ళించాలని కృషిచేస్తూ ఉంటుంది. కాని...అందరికి ఆ 'సబ్ కాన్షియన్స్' ఉన్నా కొందరు మాత్రమే - చాల కొద్దిమంది మాత్రమే

దాని ఆదేశాలను పాటించగలరు; పాటిస్తారు. చాలమందిలో పాశవికత్వపుపాళ్ళు ఎక్కువవటంచేతనే కావచ్చు - దాన్ని ఖాతరు చేయకుండా, మరీ మాట్లాడుతే అణచేసి మరీ తాము తాత్కాలిక భావావేశాలకు లొంగిపోతారు. ఇది మానవ ప్రపంచమంతట అనునిత్యమూ అనవరతంగా జరుగుతున్న విషయం.

సౌదామినిలోని తాత్కాలికమైన ఆవేశము, ఆలోచనలు ఆ మనసులోని మనసు ప్రభావంచేత చప్పగా చల్లారి పోయినవి. ఆమెలోని 'వివేకం' మేల్కొంది. ఆ నాటి కుమార్ ప్రవర్తన, ఒక్కసారిగా తన చర్యలన్నింటిని నెమరు వేసుకుసేందుకు అందుచేతనే కారణభూతమైంది. సూర్యంతో తన ప్రవర్తన; అడుగడుగున తను చూపించిన అహం భావము ఆమెకే అసహ్యంగా కనుపించినవి-అలా ఆలోచిస్తూ వుంటే!

వెనుక సీటులో కూలబడ్డ కుమార్ మెదడు మరలు కూడ సౌదామిని మాదిరిగానున్నకొద్దీ తీవ్రంగానే పనిచేస్తు న్నాయి. ఇన్నినాళ్ళ తన ఆశలు ఒక్కసారిగా కూలిపోయి నట్లు బాధపడ్డాడు అతను. ఇన్నిరోజులు సౌదామిని ప్రవర్తన, ధోరణి అతనిలో వెర్రి వెర్రి ఆశల సౌధాల నిర్మాణానికి కారణభూతమైనవి. ఒక్కసారి అలా జరగటంతో- శీతాకోక చిలుకల్లా ఆకర్షించి తేలుకొండితో కాటువేసే స్త్రీ జాతి యని విసుక్కున్నాడతను.

కృష్ణ ఆనకట్ట ప్రక్కన కారు కీచుమని ఆగింది. "రండి!" ఆప్యాయంగా ఆహ్వానించింది రాజారావు, సూర్యాల నిద్దరిని సౌదామిని. తెల్లని వెన్నెలలో - నునువెచ్చని గాలి తరంగాలు - అటువైపు కృష్ణవేణమ్మ గల గలలు వింటూ మైమరచినట్లు మెల్లగా ఆనకట్టమీద నడుస్తున్న మిత్రు లిద్దరు సడన్‌గా కారు ఆగటం, సౌదామిని ఆప్యాయంగా ఆహ్వానించటం చూచి విస్తుపోయారు. మాట్లాడకుండా కారెక్కారు. కారు గాంధీనగర్ వైపుకు మెల్లగా నడిచింది. నలుగురిలో ఏ ఒకరు నోరుకూడ మెదపలేదు.

ఇది జరిగి రెండు రోజులైంది. పని వత్తిడి యెక్కువ గావటంచేత రావుగారు వారంరోజులనుంచి యింటికే రావటం లేదు. సూర్యం రావుగారి రాకకొఱకు వేయికన్నులతో ఎదురు చూస్తున్నాడు. మానవుడు నిర్లిప్తంగా ఎక్కడివా డక్కడ లేదా ఒక పనికి కట్టుబడి గానుగెద్దులా ప్రవర్తిస్తూనే ఉంటాడు. అది అలవాటయిన జీవితం! కాని ఒక్కసారి తన కార్యక్రమాన్నిగాని లేదా తన ఉనికినిగాని మార్చుకోవాలని అనుకున్నాడా మరింక ఆగలేడు. ఒక నిర్ణయమంటూ చేసు వున్న తర్వాత ఆత్రుత ఎందుకో అధికమవుతుంది. ఏళ్ళ తర బడి ఏకాంత జీవితం చేసిన ఖైదీ తన విడుదల తేది దగ్గరయిం దని తెలుసుకుంటే ఎప్పుడెప్పుడాయని ఆత్రుత చెందినట్లే ఒక ప్రదేశాన్ని వదలాలని నిర్ణయించుకున్నవాడు కూడ చేతులు కాలినవాడిలా విల విలలాడుతాడు. సూర్యనారా యణ పరిస్థితికూడ సరిగ్గా అలాగే ఉంది. రావుగారు వచ్చిందే

తడవుగా తను శలవు పుచ్చుకొని స్వేచ్ఛావిహంగంలా రెక్క-లల్లార్చుకోవాలని భావిస్తున్నాడు.

ఆ నాడు మధ్యాహ్నం ఒంటరిగా తన గదిలో యీజీ ఛేర్‌లో పడుకొని భావి ప్రణాళికలు మనసులోనే నిర్మించుకుంటున్నాడు. ప్రక్కనే టేబుల్ ఫాన్ కావలసినంత చల్ల గాలిని సరఫరా చేస్తున్నది. దూరంగా కాఫీ కేఫ్‌లోని రేడియో శబ్దం అస్పష్టంగా వినవస్తోంది. నిమీలిత నేత్రాలతో ఆలోచనా సాగరంలో మునకలు వేస్తున్నవాడల్లా చేరవేసిన తలుపు 'కిర్ర్' మనటంతో యీ లోకంలో పడ్డాడు. తల ప్రక్కకు తిప్పి చూశాడు. సౌదామిని గదిలోకి మెల్లగా ప్రవేశిస్తోంది! ఆశ్చర్యపోయాడు సూర్యనారాయణ' ఏ నాడు తన గదిలోకి అడుగుపెట్టని సౌదామిని ఆకస్మికంగా రావటం ఆశ్చర్యమే మరి! సంభ్రమంతోపాటే సూర్యం కొద్దిగా సిగ్గుపడ్డాడని లేత యెరుపురంగు దాల్చిన అతని ముఖమే చెప్తోంది. "రండి!" తను లేస్తూ సౌదామినిని ఆహ్వానించాడు తప్పని సరికాబట్టి!

ఎదురుగా కుర్చీలో సౌదామిని కూర్చుంది.

సూర్యనారాయణకూడ తిరిగి కూర్చున్నాడు.

ఒక క్షణం – ఒక నిముషం – రెండు – మూడు —అయిదు నిముషాలు గడచిపోయాయి.

గంభీరమైన నిశ్శబ్దం భరింపరానిదిగా వారిద్దరి మధ్య అలుముకుంది.

సౌదామిని యేదో మాట్లాడాలని రెండు మూడుసార్లు ప్రయత్నించింది. కాని నోరు మెదపలేక పోతోంది.

సూర్యనారాయణ ఆశ్చర్యంతో విస్తుపోతూ ఉన్నా 'విషయ మేమిటో' ప్రశ్నించాలని ప్రయత్నించాడు. కాని నోరు తెఱచి అడుగ లేకపోయాడు.

మరో రెండు నిముషాల అనంతరం సౌదామిని హఠాత్తుగా "నన్ను క్షమించండి!" అంది.

ఆమె విశాల నయనాలు అశ్రుపూరితములయ్యాయి. ఆమె గొంతుక కన్నీళ్లతో నిండి ఉన్నట్లుంది. ఆ మాటలు అస్పష్టంగా వెలువడ్డాయి.

సూర్యం యింకా అయోమయంలో పడిపోయాడు. "ఎందుకు? నన్నే క్షమించండి! తెలిసో తెలియకనో మీాయెడ యేదైనా అపరాధం చేసిఉండవచ్చు!" గాభరాగా అన్నాడు.

అగ్ని పర్వతం యెన్నాళ్లనుండో లావాను తన గర్భంలో దాచుకొని ఒక్కసారిగా విరజిమ్మినట్లు సౌదామిని వెక్కి వెక్కి యేడుస్తూ "నాలోని అహం నన్ను నన్ను గాకుండా చేసింది. ఎన్నో రకాలుగా మిమ్మల్ని గేలి చేశాను. అయినా మీారు అచంచలంగా..." ఆగింది.

సూర్యం లేచి నిలబడ్డాడు. ఆమె ముందుగా రెండు అడుగులు వేసి అనునయపూర్వకంగా "సౌదామినీ! నన్ను నీ వెప్పుడూ బాధించలేదు. అలా భ్రమపడుతున్నావు! అంతే! వెర్రి......ఇందులో క్షమించటానికేముంది?" అన్నాడు. అతని హృదయం సౌదామిని కన్నీటితో కరిగిపోయింది.

సౌదామిని కొనగోటితో కన్నీటిని తుడుచుకుంటూ ఆలాగే స్థాణువులా నిలుచుంది.

సూర్యనారాయణకు మరేం మాట్లాడాలో అర్థం కాలేదు.

"నిజం! సౌదామినీ!...మీరు వెళ్లండి" అన్నాడు.

సౌదామిని తల వంచుకొని మెల్లగా వెళ్ళిపోయింది.

సూర్యనారాయణకు అదంతా కలా, యదార్థమా అని సందేహం కలిగింది. కళ్ళు నులుముకొని మరీ చూచాడు. కలగాదు; యదార్థమే! ఏమిటిది? సౌదామినిలో ఈ మార్పుకు కారణమేమిటి? ఆమె కన్నీటికి తనెందుకంతగా బాధపడి పోయాడు. సూర్యం తిరిగి ఆలోచనా సాగరంలో పడ్డాడు.

## ఎనిమిదవ ప్రకరణము

రాజారావు, అహల్య భోంచేస్తున్నారు. కమలమ్మ వడ్డన చేస్తోంది.

"అలా పెట్టి నీవూ కూర్చో!" అన్నాడు రాజారావు పచ్చడితో అన్నం కలుపుకుంటూ.

"కూర్చో వదినా! అందరం ఒకేమారు భోంచేస్తే బావుంటుంది" అంది అహల్య.

"మీరు తినేసి లేవండి." అంది కమలమ్మ.

భర్త భోజనానంతరమే తను తినాలని కమలమ్మకో ఆచారం! భర్త విస్తట్లో భుక్తశేషాన్ని తినడం పునిస్త్రీకి

పుణ్యప్రదమని భావించే భారత స్త్రీల కోవకు చెందిందావిడ! రాజారావు బలవంతంగా ఆ అలవాటుని మార్పించాలని యెప్పుడూ ప్రయత్నిస్తూనే ఉంటాడు. పూర్తి బలవంతం చేసిననాడు విధిలేక అందరి సరసన కూర్చుంటుందామె! ఆ యింట్లో ప్రతిపూటా భోజనాల సమయంలో అది మామూలే!

రాజారావు కంచం ముందునుంచి లేవబోతూ ఉన్నట్లు నటిస్తూ "అయితే! వెళ్ళి పోమంటావా?" ప్రశ్నించాడు చిన్న పిల్లవాడు అలిగి బెదిరించినట్లు.

"అబ్బ! రోజురోజుకీ మరీ చిన్న పిల్లవారై పోతున్నారు!" అంది కమలమ్మ తనుకూడ పీట వేసుకుంటూ.

"ఒదిన ఓడిపోయింది!" అహల్య కిలకిల నవ్వింది. గలగల సెలయేరు ప్రవహించినట్లుంది ఆ నవ్వు.

చెల్లి నవ్వుతో శ్రుతికల్పాడు రాజారావు! కమలమ్మ ముఖం ప్రక్కకు త్రిప్పి నవ్వు నాపుకుంటూ "జోడా బాగా కుదిరింది! అన్నయ్యకు తగిన చెల్లెలే! రేపు మా తమ్ముడేలాంటి వాడు వస్తాడో కాని..."మధ్యలో ఆగింది.

వదిన మాటలతో అహల్యసిగ్గుపడిపోతూ "నీకెప్పుడూ నా పెళ్ళి ధ్యాసే! ఇంకేం ప్రపంచంలో ఆలోచించవలసింది లేనట్లు—" గుణిశింది.

అప్పటివరకు ఉల్లాసంగా ఉన్న రాజారావు వదనంలో ఆలోచనారేఖలు పూర్తిగా అలుముకున్నాయి. చెల్లి పెళ్ళి విషయం రోజూ తన్ను క్రుంగదీస్తున్నా యేనాటికానాడు వాయిదా వేసుకుంటూ కాలం గడుపుతున్నాడు. రెండు

మూడు రోజులనుంచి తన ఆలోచనలని కార్యరూపంలోకి పరివర్తన చెందేలా చేయాలని తలపోస్తున్నాడు కూడా.

"కమలా! రేపు నా ప్రయాణం!" అన్నాడు నెమ్మదిగా.

కమలాహల్యలు రాజారావు హటాత్ ప్రసంగానికి ఆశ్చర్యపోయారు. "ఎక్కడకు?" ఇద్దరూ ఒకేమారే ప్రశ్నించారు.

"నర్సరావుపేట వెళుతున్నాను. మా మేనమామ శివరామయ్యగారు నీకు గుర్తుందా?..." కొద్దిసేపాగి "మన పెళ్ళికికూడ వచ్చివున్నారు. లావుగా...నల్లగా..." భార్యకు గుర్తుచేశాడు రాజారావు.

కమలమ్మకు గుర్తొచ్చింది. అహల్యకూడ గుర్తుచేసుకుంటోంది – స్మృతిపథంలో పూడుకపోయిన మేనమామను గురించీ, ఆయన సంసారాన్ని గురించీను.

"ఊఁ...రామకృష్ణ యిప్పుడు యిరవై రెండవయేట పడివుండాలి. ఆ...అంతే! చూస్తాం!" స్వగతంగా మాట్లాడుకుంటున్నట్లుగా మాట్లాడాడు రాజారావు.

విషయాన్ని అప్పటికి పూర్తిగా అర్థం చేసుకున్న కమలమ్మ బరువు దించుకున్నట్లుగా నిట్టూర్పు విడుస్తూ "అబ్బ! ఈ నాటికి మీకీ ఆలోచన వచ్చిందండీ! నేను మూడేళ్ళనుంచి అహర్నిశలు కొట్టుకుంటూనే వున్నాను. సరే! భగవంతుని ధర్మమా యని యిప్పటికైనా మీకు తోచింది–అంతే చాలు! వెళ్ళండి రేపే...తప్పక ఫలిస్తుంది. మన అహల్య అదృష్టవంతురాలు..." పాత భావాలకు

ఏకైక ప్రతినిధిగా ఆ యింటిలో ఉన్న కమలమ్మ సంతోష పడింది. అవును. ఆడపడుచు యెదిగి మూడేళ్ళు దాటినా ఆమె పెళ్ళి వూసుకూడ రాజారావు యెత్తకోకుండా వుండటం నదినగా ఆమెకు బాధేగా మరి.

"పోవాలని నిర్ణయించుకుంది నేను. వెళ్ళేది నేను. మధ్యలో భగవంతుని దయ ఏమిటి నీ చాదస్తంగాని..." రాజారావు తన సహజ ధోరణిలో భార్యను యెద్దేవా చేస్తూ చెల్లెలివైపు పరికించి చూశాడు.

అన్నంముందు కూచునే అహల్య ఆలోచిస్తోంది - ఏమిటీ భారతదేశం? ఆడపిల్ల అంటే యెప్పుడు వదిలించుకోవాలాయని తల్లిదండ్రులు తోబుట్టువులు ఎప్పుడూ ప్రయత్నిస్తూనే వుంటారు. ఒకవేళ వారు తమ కర్తవ్యమును ఏమాత్రం నిర్లక్ష్యం చేసినట్లనిపించినా యిరుగు పొరుగులన బడేవారు. పరిచితులు - అందరూ ముల్లుకర్ర పోటుల్లాంటి మాటలతో పొడచి కర్తవ్యాన్ని గుర్తుజేస్తూ వుంటారు. ముక్కూ- ముఖం యెరుగని ఏ అయ్య చేతిలోనో పెట్టేయాలని, తమ బాధ్యతను దులుపుకోవాలని ప్రయత్నిస్తారు పెద్దలు! స్త్రీ ఒక వస్తువుగాతప్ప ప్రాణమున్న వ్యక్తిత్వంగల ఒక వ్యక్తిగా పరిగణింపబడటంలేదు. స్త్రీ జీవితం స్త్రీ చేతిలో లేదు! ఆమె జీవితాన్ని ఎప్పుడూ యెవరో ఒకరు నిర్ణయిస్తూ ఉండవలసిందేనా? మగాడిలా తను కోరినచోట వివాహమాడే స్వేచ్ఛ లేకున్నా, వివాహం లేకుండా వూరుకుందామన్నా వీల్లేనంత వింత పరిస్థితి సృష్టింపబడింది స్త్రీ చుట్టూ. దీనికంతటికి కారణం స్త్రీకి ఆర్థిక స్వాతంత్రం లేకపోవటమేనా?

అదృష్టవశాత్తు తన అన్నయ్య అభ్యుదయ భావాలు కలవాడేకాని ప్రయోజనం? ఇంకా ఆయన బాధచెంది హృదయాన్ని కలతపెట్టుకోవాలి తన కారణంగా! వదిన ఆరాటాన్ని లెక్క-చేయనట్లు నటించినా అన్నయ్య హృదయంలో రోజూ తన్ను గురించిన ఆలోచనలు అమితంగా బాధపెడుతూనే వుంటాయి. తన బాధను బయటకు వెలువరించలేక సతమతమవుతూ వుంటాడు.

"ఏమమ్మా, పెళ్ళికూతురా! రాబోయే భర్తను తలచుకుంటున్నావా?" వదిన వేళాకోళంతో యిహ ప్రపంచంలో పడి సిగ్గుపడిపోయింది అహల్య.

రాజారావు అహల్యవైపు చూచాడు. అప్పుడే అహల్య కూడ రాజారావు వంక చూచింది. అన్నా చెల్లెళ్ళ చూపులు రెండు రెండు క్షణికాలపాటు కల్సుకున్నాయి. కాని...ఆ రెండు క్షణాల్లోనే వారు ఒకరి మనోగత భావాల్ని, ఆలోచనలను మరొకరు అర్థం చేసుకున్నారు. వారిద్దరి ఆలోచనా విధానాలు ఒకటే! రాజారావులో వచ్చిన సంస్కారం అక్కడితో ఆగక చెల్లెలిలోకికూడ ప్రవహించింది. అందుకే రాజారావు తన చెల్లి అహల్యను తలచుకొని ఆనందమూ గర్వమూ పొందుతూ వుంటాడు ఒక్కొక్కప్పుడు. కాని బాధ దుఃఖము కూడ అనుభవిస్తువుంటాడు ఆ వెను వెంటనే! తన సోదరి భవిష్యత్తు యేలా వుంటుందో ననే దిగులే అతని ఆ భావాలకి కారణం.

ఆ రాత్రి చాలసేపటివరకు గదిలో అన్నయ్య వదినతో తన వివాహ సమస్యను గురించే మాట్లాడుతూ వున్నట్లు—

మధ్యలో సూర్యనారాయణ పేరుకూడ వినిపించినట్లు అస్ప
ష్టంగా వినిపించింది హాలులో పడుకున్న అహల్యకు.

మిట్ట మధ్యాహ్నం! ఎండాకాలం - తారు రోడ్డు
కోపంతో కసిదీర్చుకుంటున్నట్లు కరిగిపోతూ కాళ్ళకు అంటు
కుంటోంది. పాశెంజర్ దిగి రిక్షాకు డబ్బులు ఖర్చుబెడ్తే తిరుగు
చార్జీకి తక్కువవుతుందని కాలినడకనే వూళ్ళోకి బయలు
దేరాడు రాజారావు! నర్సరావుపేట అభివృద్ధి చెందుతూవున్న
పట్టణం. ఎప్పుడో పదేళ్ళనాడు ఒకసారి చూచాడు
రాజారావు. ఆ నాటికి రైల్వేస్టేషన్‌కి వూరికి మధ్య యిళ్ళే
లేకుండా, రోడ్డుప్రక్క బురద నీటి గుంటలతో, తుమ్మచెట్ల
పొదలతోను వుండేవి. కాని నేడు చాలవరకు ఆ మధ్యలో
అంతా యిళ్ళేమి - భవనాలే వెలిశాయి. పదేళ్ల కాల
గతిలో పట్టణంలో వచ్చిన మార్పుల్ని పరికిస్తూ మెల్లగా
మేనమామ యిల్లు చేరుకున్నాడు రాజారావు.

శివరామయ్యగారిది ఒక మోస్తరయిన యిల్లు! ఇల్లు
పెద్దదే కాని చాల పురాతన కాలంనాటిది. వెనుకవైపు పడి
పోయిన భాగం పడిపోయినట్లే వుంది మరామ్మత్తు లేకుండా!
వీలయినంత త్వరలో మొత్తం యింటిరూపాన్ని మార్చి మంచి
భవనం నిర్మించాలని శివరామయ్యగారి ఆశయం. పనుల
తొందరలో ఆ ఆలోచన యేనాటి కానాడు వాయిదా పడు
తోంది.

శివరామయ్యగారు అప్పుడే భోజనం ముగించుకొని భారమైన తమ శరీరాన్ని యీజీఛేర్‌లో పడవేసి ఎదురుగా స్టూల్ మీద స్టెయిన్ లెస్‌స్టీల్ ప్లేటులోనున్న 'మల్‌గుబా' మామిడిపండు ముక్కల్ని చప్పరిస్తున్నారు. అర్ధ దిగంబరంగా, నల్లగా చిన్నకొండమాదిరే వున్నారాయన. పడుకున్న యీజీ ఛేర్ ఆయన కదలికలకు పిటపిటలాడుతోంది. అతి దట్టమైన కనుబొమ్మలు, గుబురు మీసాలు, బూరబుగ్గలు- విలక్షణంగా అవుపిస్తారా వ్యక్తి! వెంకటమ్మగారు విసన కర్ర పుచ్చుకొని మెల్లగా భర్తకు విసరుతోంది. అయినా స్వేదబిందువులు అప్పుడే స్నానంచేసి శరీరాన్ని పొడి బట్టతో తుడుచుకోకుండా వుండేవానిలా వున్నాయి ఆయన వంటినిండా. భుక్తాయాసం శివరామయ్యగారి కళ్లలోను ముఖమంతటాను విస్పష్టంగా అవుపిస్తోంది.

చేతిలో సంచి, ఎండకు నల్లనైన ముఖము - రాజారావు లోపలికి అడుగిడినాడు. "ఎవరది?" బొంగురు గొంతుకతో ప్రశ్నించి రాజారావు జవాబిచ్చేలోగానే పరికించి పరిశీలించి చూచి "ఓ! నీవటోయ్! రా! రా!...ఏమేవ్ !— రాజుకు కాళ్లకు నీళ్లివ్వు!...ఆ...ఆ బ్యాగ్ అక్కడే పెట్టు! ఫో...మీ అత్తయ్య వెంట బచ్చలిలో కెళ్లు! అంతా బావున్నారు కదూ!...సరే-భోజనం కానివ్వు! ఆ తర్వాత నెమ్మదిగా మాట్లాడుకోవచ్చు!" రాజారావు నుండి జవాబులు ఆశించకుండానే ఆయన గబగబా మాట్లాడేశారు. అత్తగారి వెంట బచ్చలిలోకి వెళుతూ "అనుకున్న పని నెరవేరవచ్చు

మామగారిలో యింకా ప్రేమ పూర్తిగా చావలేదు!" అని అనుకున్నాడు రాజారావు మనసులోనే.

రాజారావు భోజనం ముందు కూర్చుంటూ "రామ కృష్ణ యేడి అత్తయ్యా!" ప్రశ్నించాడు.

"వాడు విజయవాడలో చదువుతున్నాడుగా!" వెంక టమ్మగారంది.

"విజయవాడలోనా!" రాజారావు ఆశ్చర్యంగా ప్రశ్నిం చాడు.

అవునని ఆమె తల వూపింది.

కుమారుణ్ణి గురించి, వాడి చదువును గురించి, ఆమె యేమేమో మాట్లాడుతూ వుంటే రాజారావు వూకొడ్తూ భోంచేస్తున్నాడు. సంబంధాలు, రాకపోకలు వుంటేనే బంధు త్వాలు! లేకపోతే యెవరి కెవరో! తమ కుటుంబానికి తల్లి మూలంగా ఆత్మీయులైన యీ కుటుంబంవారు ఆమె ప్రాణాలు కాస్తా పోతూనే దూరమయిపోయారు. రామకృష్ణ విజయ వాడలో చదువుకుంటున్నాడని వింటూనే రాజారావు మనస్సు కొద్దిగా కించబడింది. తాముంటే నగరంలోనే చదువుతూ తమ యింటి ఛాయలకుకూడ రాలేదేనని బాధపడ్తూ తిరిగి తాము విజయవాడలో కాపురముంటున్నట్లు యెరుగరేమో లేయని తిరిగి తనంతకు తానే సరిపెట్టుకున్నాడు.

శివరామయ్యగారికి పదెకరాలు బంగారంలాంటి పొలం వుంది. ఒకటో నెంబరు మేలైన పొగాకు పండుతుందా పొలంలో! ఇద్దరు కమతగాళ్లనుపెట్టి స్వయంగా వ్యవసాయం సాగిస్తారాయన. ఏటా ఖర్చులు పోను వెయ్యిరూపాయలైనా

నిలువచేస్తూ వుంటారు! నగల రూపంలోను, ఇనప్పెట్టెలోని క్యాష్ రూపంగాను కలసి లకారంలో పడుతూ వుంటుంది ఆయన ఆస్తి! రామకృష్ణ కుమార్ ఒక్కగా నొక్క కొడుకు. పిసినారి అని చెప్పలేకున్నా డబ్బు దగ్గర కొంచం గట్టిమనిషే నని అనుకుంటారు ఆయన్నిగురించి యితరులు! ఒడిదుడుకులు లేని నిర్మల నదీ ప్రవాహంలా కొనసాగిపోతూ వుంటుంది ఆ కుటుంబం! చీకు చింత లెవరికీ లేవు. ఉద్రేక వుద్వేగాలంటూ అసల్లేకుండా అతి మామూలుగా గడియారంలోని ముళ్లలాగా క్రమబద్ధంగా సాగుతూ వుంటాయి వారి జీవితాలు!

రాత్రి ఆరు బయటన మంచాలమీద కూర్చున్నారు. వెన్నెల చల్లగా తెల్లగా ప్రకాశిస్తోంది. దూరంగావున్న సినిమాహాల్లోంచి రికార్డులేవో మెల్లగా అస్పష్టంగా వినిపిస్తున్నాయి. రాజారావు అభిమానం చంపుకుంటూ చెప్పలేక చెప్పాడు తను వచ్చిన పనిని గురించి. "అయినా దగ్గరైన వాళ్ళుండగా ఎక్కడో యెందుకు చూడాలి? మిమ్మల్ని కనుక్కొని తర్వాత ఇతర ప్రయత్నాలు చేయవచ్చుననుకున్నాం" అన్నాడు ముగింపుగా. సూటిగా తప్ప లౌక్యంగా మాట్లాడటంలో అనుభవమంతగా లేని రాజారావు ఆ మాటలు కృతార్థ్యవస్థతో యేలాగో అన్నాడు!

అందులోను రాజారావుకు యిల్లాంటి విషయాల్లో ప్రవేశమూ లేదు; చాకచక్య మసలే లేదు. అందుకే అతనికి మాటలు తడబడ్డాయి.

శివరామయ్యగారు గట్టిగా నవ్వారు. ఫక ఫకా ఆయన నవ్వుతోంటే రాజారావు విస్తుపోయాడు. వెర్రిముఖం వేసు

కొని, ఆయన ముఖతా జవాబు వినేందుకు కూర్చున్నవాడల్లా గాభరాపడ్డాడు.

"ఒహో! ఎందుకోయ్ అంతగానట్లు కొడ్తావ్? శుభం! శుభం! పాత చుట్టరికాలు కలుస్తూవుంటే నేను కాదంటానా? కుమార్ అభిప్రాయం ముఖ్యంగదూ! కనుకొని అలాగే చేస్తాం!" అన్నారు భోళామనిషైన శివరామయ్యగారు నిష్కా-పట్యంగా.

"కుమార్ యెవరు?" ప్రశ్నించాడు రాజారావు.

తిరిగి బిగ్గరగా నవ్వారాయన. నవ్వుతూనే "మన వాడేనోయ్!" అన్నారు.

"రామకృష్ణకదూ!" తన సందేహాన్ని బయటపెట్టాడు రాజారావు.

శివరామయ్యగారు నవ్వును బలవంతాన ఆపుకుంటూ "ఈ కాలమంతా కుర్రాళ్ళదేనోయి! లక్షణంగా నేను 'రామ కృష్ణ కుమార్' అని పేరెడితే–వాడు ముందుండే నాల్గక్షరాలకీ విడాకులిచ్చి వృత్తి కుమార్ అయి కూర్చున్నాడు. ఫ్యాషన్స్-కురచ చొక్కాల్లాగే పేర్లుకూడ కుఱచగా వుండలేమో! ఓహో..." తిరిగి ఆయన నవ్వసాగారు.

మరునాటి ఉదయం రాజారావు మామగారివద్ద శలవు పుచ్చుకొని కుమార్ అడ్రసు నోట్ చేసుకొని మరీ తిరుగు ముఖం పట్టాడు. నర్సరావుపేటకు ప్రయాణ మయ్యేటప్పుడు సంశయాస్పదంగా కనుపించిన తన ప్రయత్నం యింత సుల భంగా కార్యరూపంలోకి పరివర్తనమవుతున్నందుకు రాజా రావు తృప్తిగా నవ్వుకున్నాడు.

# తొమ్మిదవ ప్రకరణము

గోడనున్న గడియారం టిక్కు టిక్కు ధ్వని తప్ప ఆపరేషన్ రూమంతా ప్రశాంతంగా వుంది. లోషన్ వాసన ముఖం మొత్తేలా వుంది! ఇంచు మించు ఆ గదినంతా అతను పడుకున్న ఆపరేషన్ టేబుల్ ఆక్రమించింది. ఆ టేబుల్ మీద పడుకున్న అతని శరీరం నగ్నంగా వుంది. అతని శరీరాన్ని విద్యుత్కాంతులు పూర్తిగా ఆవరించి ముంచెత్తి వేస్తున్నాయి. అతని మర్మావయవాల్ని, గుండెని నిశితంగా పరికించిన డాక్టర్ చప్పరించాడు. డాక్టర్ సైగతో లేచి బట్టలు తొడుక్కుని బాధగా నిలబడ్డ అతను డాక్టర్ వైపు ఆత్రంగా చూస్తున్నాడు. డాక్టర్ నోటినుంచి వెలువడే పలుకులమీద అతని జీవితం ఆధారపడి వుందేమో నన్నంత ఆత్రంగా చూస్తున్నాడు అతను డాక్టర్ ముఖంకేసి!

డాక్టర్ బేసిన్‌లో చేతులు కడుక్కున్నాడు. తెల్లని టర్కిష్ టవల్‌తో చేతులు తుడుచుకుంటూ యిరుకైన ఆ గదిలో మెల్లగా, సాలోచనంగా పచార్లు చేస్తున్నాడు.

అతనికి క్షణం ఒక యుగంలా వుంది! డాక్టర్ ప్రతి కదలికను అతని చూపులు వెంటాడుతున్నాయి. గదిలోని ప్రశాంత నిశ్శబ్దం అతని మనసుకు భరింపరానిదిగా తోస్తూన్నది.

"మిస్టర్ కుమార్! జీవితం చాల విలువైందనే విషయాన్ని మరచిపోతూ వుంటారు మీలాంటి యువకులు!

మానవులై వుండీ పాశవికశక్తులకు మీరింతగా యెందుకు లొంగి పోతారో...నాలాంటివాడిని వూహించటమే కష్టంగా వుంది. మిమ్మల్నని ప్రయోజనమేమిటి? పాశవిక ప్రవృత్తిని తట్టిలేపే పుస్తకాలు...సినిమాలు...ప్చ్...ప్చ్..."

డాక్టర్ ఉపోద్ఘాతంగాని, చెప్పే నీతులుగాని కుమార్ కి అవసరంలేదు. విషయమేమిటో సూటిగా యెందుకు చెప్పడా అని లోలోనె విసుక్కున్నాడు. అయినా వయస్సు పెరిగే కొద్దీ వీరికి చాదస్తం యెక్కువవుతూ ఉంటుంది అని అను కుంటూ డాక్టర్ మాటలకు వూకొట్టాడు.

అనుభవాలతో నెరిశిపోయిన దట్టమైన తెల్లని కను బొమల్ని కుంచిస్తూ "మిస్టర్! కొన్ని నెలలపాటు పూర్తిగా విశ్రాంతి తీసుకుంటూ యిక్కడ ట్రీట్మెంటు తీసుకుంటేనే ఈ వ్యాధిని శాశ్వతంగా నీ శరీరంలోనుంచి పారద్రోలేం దుకు వీలవుతుంది. ఇది భయంకరమైన......" ఆదుర్దా అమితంగా వ్యక్తపరచే యువకుని ముఖంవంక సూటిగా చూస్తూ డాక్టర్ మధ్యలోనే ఆపాడు తన మాటల్ని.

"వెంటనే నయంకాదా డాక్టర్! ఎంత డబ్బయినా సరే..." అన్నాడు కుమార్.

డాక్టర్ చిలిపిగా నవ్వాడు. "వెంటనే నయం... డబ్బు...ఎంత డబ్బయినా సరే...డబ్బుతో ఆరోగ్యాన్ని కొనడం అంత సులభమని భావించకమాక. నయం కావాలి...శాశ్వతంగా నయం కావాలి. లేకపోతే నీ జీవి తమే నరకమౌతుంది. తాత్కాలికమైన వుపశమనాలతో

లాభం లేదు. నా సూచనలు ఖచ్చితంగా అమలు పరుస్తావా?''
డాక్టర్ గంభీరంగాను, సూటిగాను అడిగాడు కుమార్‌ని.

కుమార్ అంగీకార సూచకంగా తలూపాడు.

డాక్టర్ యువకుడికి ఒక యింజెక్షన్, కొన్ని మందులు యిచ్చి ''సరే! ఇక వెళ్లు! నీ పనులేమైనావుంటే చక్కబెట్టుకొని ఒకవారం రోజుల్లో వచ్చి యిక్కడ జాయినవు. ఇప్పుడు నీ కిచ్చిన మందులు తాత్కాలిక ప్రయోజనానికే! నయమైందని తృప్తిపడేవ్ సుమా! ఏ సుముహూర్తంలోనైనా యిట్టే తిరగబెట్టే జబ్బది!'' అన్నాడు డాక్టర్ జగన్నాథ్.

కుమార్ డాక్టర్ మాటలన్నింటికి తల వూచాడు. ఆ తర్వాత డాక్టర్‌తో శలవు పుచ్చుకొన్నాడు.

నీరసంగా నిస్తేజంగా తల వంచుకొని పోతూవున్న యువకుడిని చూచి జాలిపడ్డాడు డాక్టర్.

ప్రపంచంలో నాగరికత రోజురోజుకీ యెక్కువై పోతోంది. ఆరోగ్యకరమైన విషయమే! కాని...దాంతో పాటే కొన్ని విపత్కరమైన అలవాట్లు, పరిస్థితులు యేర్పడుతున్నవి. యవ్వనం ఒక పవిత్రమైన వరంలాంటిది మానవుడికి. జీవిత పథాన్ని నిర్ణయించే దశ అదే! ఉడుకు రక్తం, దేన్నీ ఖాతరు చేయకుండా ఛాతీ విరచుకొని తిరిగే దశ అది! ఏ చీకూ చింతలు వుండవు. చమటోడ్చి సంపాదించేది పెద్దలు! తమకి ఏ బాదర బందీ వుండదు. పట్టణాలకు చదువులకు వచ్చి కృత్రిమ నాగరికతా వ్యామోహంలో పూర్తిగా పడిపోతున్నారు యువకులు! పాదరసంలాంటి వారి మనసులను ప్రక్కలకు

మళ్లించేందుకు నేటి సమాజంలో వివిధ విషయాలు - నాగరి
కత...యథాశక్తిగా పాటుపడుతూనే వున్నాయి. సెక్స్
పేరుతో వెలువడే పుస్తకాల్లో వుండేవి సెక్సు విజ్ఞానం కాదు-
నేతిబీరకాయ బాపతువవి! మానవునిలో దాగియుండే జంతు
తత్వాన్ని రెచ్చగొట్టి వూరకే వారిని కామోద్రిక్తుల్ని
చేస్తవా పుస్తకాలు! క్షణికమైన ఆనందంకోసం, వురకలు వేశే
వుద్రేకం కోసం - అదే, నరాల మత్తుకోసం యువకులెంతో
అసక్తితో ఆ పుస్తకాలు చదవటం - వాటి ప్రభావానికి
పూర్తిగా లోబడిపోవటము జరుగుతోంది! పైగా అర్ధ దిగం
బర దృశ్యాలతోను, ముసలాళ్లలోకూడ వుద్రేకాన్ని ప్రకో
పింపజేసే అంగవిన్యాసంతోను అమెరికన్ ఇత్యాది చిత్రాలు!
అవి వాటి ధర్మాన్ని నెరవేరుస్తున్నాయి. యువకుల జీవితాల్ని
పణంగా కోరే యీ వ్యాపారమంతా కళ పేరుతో జరిగి
పోతోంది! దీన్నడ్డే నాధులెవరూ లేరు! దీనికితోడు సమా
జంలో వుండే ఎగుడు దిగుడుల ఆర్థిక వ్యవస్థ! కలిగినవారి
వైపుకే సంపదంతా పోయి చేరుకుంటూంటే లేమితో
బాధ పడేవారు మరింతగా నలిగిపోతున్నారు. విధిలేక - మరో
గత్యంతరం కనుపించక వారిలో కొందరు ఘోరంగా నైతిక
పతనం పాలవుతున్నారు. దురాశాపరుల పేరాశ ఒకవైపు,
ఆర్థిక పరిస్థితుల ధర్మమూ అని పతనం పాలైనవారు ఒకవైపు...
తత్ఫలితంగానే సమాజమంతా కుళ్లుకంపు కొట్టడం!
హత్యలు - దగాలు - దోపిడీలు - వ్యభిచారాలు - యినన్నీ
ఆర్థిక వ్యవస్థ సృష్టించిన వినాశనానికి తిరుగులేని సాక్ష్యాలు!
అనాది సిద్ధంగా నైతిక విలువలకి ఆదర్శప్రాయమైన భారత

దేశంలో తిండికోసం శరీరాన్ని అమ్ముకునే అతివలు ప్రతి పట్టణంలోను కనుపిస్తారు. చివరికి యిదో వ్యాపారంగాగూడా పరిణమించింది. ఏ సినిమాహాలుముందు చూచినా, యే జాతర్లలో చూచినా వీళ్ల గుంపులు ప్రత్యక్షమవుతవి. సీతాకోక చిలుకల్లా సింగారించుకొని దేశంలో ఆవిర్భవించే కాంగ్రెసు మార్కు 'సోషలిస్ట్ వ్యవస్థ'కు చిహ్నంగా వీరు తమ కితరుల ద్వారా అంటుకున్న సుఖరోగాల్ని సమాజపరం చేస్తూ వుంటారు!

కృత్రిమ నాగరికతా విధానాలద్వారా నైతికంగా పతనమైన బృందమొకటి, పైబృందమొకటి! ఈ రెండుకూడా సమాజంలో దారిద్ర్యంతోపాటే, కుబేరుల సంపదలు పెరిగినట్లే పెరిగిపోతున్నవి. ఈ అంతరాలు రోజురోజుకీ యీలాగే పెరిగిపోతూవుంటే దీని కంతమెక్కడ? ఈ విధానాలీలానే కొనసాగిపోతూ వుంటే...?

రామకృష్ణ కుమార్ ఆలాంటి యువకులకి ప్రతిబింబం. ఒక్కగా నొక్కకొడుకని శివరామయ్యగారు కావలసినంత, అడిగినంత డబ్బు పంపుతూ వుంటారు. విజయవాడ చేరిన రెండేళ్లకే పై కృత్రిమ నాగరికతా ప్రభావానికి పూర్తిగా వశుడై పోయాడు. అగాధంలోనైనా కళ్ళుమూసుకుని దూకించగల యౌవన దశ అతణ్ని యీ రూపులోకి మార్చింది! నాలుగు రోజుల క్రిందట నగరంలో పేరు మోసిన ఒక లాడ్జింగ్‌లోకి వయారి మిఠారులు కొందరు వచ్చి బస చేశారు. లాడ్జింగ్ ప్రొప్రయిటర్ వ్యాపారంలో అదొక భాగం! సరే. షోకేళాలు, కాలేజి కుర్రాళ్లు కొందరు

ఉండనే ఉన్నారు - ఒక్కరాత్రి యాభైరూపాయలు ఖర్చు పెట్టుకున్నాడు కుమార్. ఆ క్షణంలో అదో మధురానుభూతిగా భావించుకున్నాడు. తాత్కాలికంగా నరాల వ్యవశమనం లభించింది కూడా - కాని, మరునాటి ఉదయంనుంచే అతని శరీరంలోకి ఏదో బాధ ప్రవేశించింది. గిలగిల్లాడిపోయాడు. నడుంవద్దనుంచి మోకాళ్ళవరకు నల్లటి మచ్చలు ఏర్పడ్డాయి. గడియారంలోని స్ప్రింగుల్లా ఆ భాగాల్లో వుండే నరాలన్నీ యెప్పుడూ విపరీతంగా లాగుతూనే ఉంటాయి. విపరీతమైన తన బాధను తనలోనే దాచుకున్నాడు. ఆ బాధను బహిర్గతం చేయడానికి సిగ్గు అవమానము అడ్డువచ్చాయి. అందుకని యెవ్వరికి తెలియకుండానే తనకు తోచిన మందులు వాడాడు. కాని...బాధ శ్రుతి మించిపోయింది. ఈ నాడు విధిలేక మరింక ఆగలేక డాక్టర్ దగ్గరకు వచ్చాడు.

డాక్టర్ పలుకులు విన్నప్పటినుండి కుమార్ నవనాడులు క్రుంగిపోయినట్లుగా ఫీలవుతున్నాడు. "భయంకరమైన..." పదాన్ని పూర్తిచేయకుండానే ఆపేశాడు డాక్టర్! చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుంటే లాభమేముంది? తన విచ్చలవిడి తిరగటానికి, తన అసభ్యమైన ప్రవర్తనకు పశ్చాత్తాప పడుతున్నాడు కుమార్. భావిని గురించి కమ్మగా కలలు కనటం అలవరచుకున్న తను యింకేం కలలు కనాలి? పెద్ద ప్రశ్న అతని యెదుట ప్రత్యక్షమవుతూ ఉన్నట్లుంటే రిక్షా దిగి గదిని సమీపించాడు పరధ్యానంగా. గది ముందరే సిమెంటు తిన్నెమీద రాజారావు కూర్చుని ఉన్నాడు. రాజారావుతో ప్రత్యక్ష పరిచయం లేకున్నా సౌదామినికి సన్ని

హితుడైన ఆప్తుడుగా అతన్ని యెరిగే వున్నాడు కుమార్! రాజారావును చూచిన వెంటనే గతుక్కుమంది అతని మనసు. ఆలోచనా ప్రపంచంలో కొట్టుకుపోతూ వున్న రాజారావు తలుపు తెరచిన శబ్దం విని హటాత్తుగా తలెత్తి చూశాడు, ఇతడేనా తన బావమరది రామకృష్ణకుమార్! విస్తుపోయాడు. వారి నాల్గు కళ్ళు ఒక్కమాటు కలుసుకున్నాయి.

"మీరు...నా కోసమేనా...?" కుమార్ గొంతు కుక్కన్నట్లు అన్నాడు.

"కుమార్ మీరే కదూ!" అతని ప్రశ్నకు జవాబులా గాకుండా తన ప్రశ్నకు తనే జవాబు చెప్పుకొన్నట్లు మాట్లాడాడు రాజారావు,

కాలమెంత గడుసయింది! ఆప్తుల్ని అయిపులేకుండా నిర్దాక్షిణ్యంగా వేరు చేస్తుంది...హటాత్తుగా తిరిగి కలుపుతుంది కూడ!

"రండి!......" ఆహ్వానించక తప్పదు కాబట్టి ఆహ్వానించాడు కుమార్! గదిలో కుర్చీలమీద యిద్దరూ కూర్చున్నారు. రాజారావు యెందుకొచ్చాడో? సౌదామిని పంపివుండవచ్చా? ఆలోచిస్తున్నాడు కుమార్. కాని అడిగేందుకు ధైర్యంలేదు!

సంభాషణేలా ప్రారంభించాలో తెలియక తికమక పడ్తూ "రామకృష్ణా! మరచిపోయావా, మీ రాజారావు బావని?" ఆకస్మికంగా అడిగేశాడు రాజారావు.

రాజారావు పలుకులు విన్న కుమార్ మెదడు మడతలు తీవ్రంగా పనిచేశాయి. అవును! పదమూడేళ్ళయింది రాజా

రావుకు చూచి. తర్వాత తటస్థపడనే లేదు. నాన్న ఘనంగా చెబుతూవుంటాడు రాజారావు బావని గురించి. వ్యక్తిత్వం వచ్చిన తర్వాత తనుకూడా చూడాలని చాలమార్లు వాంఛించాడు. ఒకసారి జైలు అడ్రస్ దొరికింది. మరోమారు యెక్కడవుండేది కూడ తెలిసిందిగాదు. విజయవాడకు వచ్చిన తర్వాత తనుపడ్డ కొత్త అలవాట్లు, నూతన మిత్రులు... పూర్తిగా మరచిపోయేలా చేసినవి. కుమార్ రాజారావు వంక మరోమారు పరిశీలనాదృష్టులను సారించాడు. పదమూడేళ్ళ నాటి బావ ఛాయలు రాజారావు ముఖంలో ఛాయగా కనిపిస్తున్నట్లు అతని దృష్టికి వచ్చింది. "బావయ్యా!" చిన్నపిల్లాడిలా అన్నాడు.

రాజారావు నేత్రాలు సజలములైనాయి. "నీ వెనరో తెలియకుండానే నిన్ను యెన్నోసార్లు చూశాను. కాని... తెలిసి చూడటం యిదే ప్రథమం కుమార్! పద, పోదాం యింటికి!" అన్నాడు.

రాజారావు యెదలోకి ఒక్కసారిగా కుమార్ సోదామినుల షికార్లు గుర్తుకొచ్చి అదోలా బాధపడ్డాడు. 'ముళ్ళు విప్పాలని ప్రయత్నిస్తే మరీ చిక్కుబడిపోతూవున్నట్లుంది వ్యవహారం' అని మనసులోనే భావించుకొని బాధగా చిరునవ్వు నవ్వుకున్నాడు.

కుమార్ రాజారావుని గమనించటంలేదు. అతని ఆలోచనా ధోరణి అతనిది. అతనికి నవ్వాలో యేడ్వాలో అర్థం కావటంలేదు! తన తండ్రి మాటల ప్రభావంచేత రాజారావు వ్యక్తిత్వంమీద అతనికి అపారమైన గౌరవముంది. కాని...

స్మృతిపథంలో మరుగుపడిపోయిన తన బంధువును గురించి అప్పుడప్పుడు ఆలోచించేవాడు కూడా! అల్లాంటి బావ పరిచయ భాగ్యం కల్గినందుకు ఆనందించాలో లేక జీవితాన్ని యెడారిగా మార్చే పాడు జబ్బు తనకు దాపురించినందులకు దుఃఖించాలో—ఏమిటీ ప్రపంచం? బండిచక్రాల్లోని ఆకుల్లా తిరుగుతూవుంటవేమో కాలవాహినిలోని పుటలు!

"బావా! అందరూ బావున్నారా?" అంతవరకు క్షేమ సమాచారములైనా విచారించలేదేననే సంకోచంతో అప్పుడడిగాడు కుమార్!

రాజారావు జవాబుగా చిన్నగా నవ్వుతూ తలూపాడు.

నూతనంగా పరిచయస్థులైన బావ బావమరుదులిద్దరూ రిక్షాలో బయలుదేరారు రాజారావు నివాస స్థానమైన కృష్ణ లంకకు.

రెండు రిక్షాలు ఒకదాని వెంట మరొకటి పయనిస్తున్నవి. గంటలు గణగణమని మ్రోగుతున్నవి. పల్లంలో పరుగిడినట్లుగాను,మిట్టలమీద యీడిగిలపడి నడుస్తూవున్నట్లుగాను రిక్షాలు వెళ్లుతున్నవి.

రిక్షాల్లోని యిద్దరి వ్యక్తులుకూడ తమ హృదయాలంతటా నిండిపోయివున్న ఆలోచనలతో సతమతమవుతున్నట్లున్నారు.

రాజారావు ఆలోచిస్తున్నాడు. రాజారావు దృష్టిపథానికి నలుగురు వ్యక్తులు స్పష్టంగా అవుపిస్తున్నారు. సూర్యం, సౌదామిని, కుమార్, అహల్య- వారు నలుగురూను! ఏమిటీ ఆశ్చర్యం! సూర్యనారాయణకి అహల్యమీద మనసుపడి

నట్లుంది! ఏ పరిచయం లేకున్నా, అందుకు ప్రతిఫలంగా మెన లేని కష్టాల్ను యెదురవస్తవని తెలిసినా అతడు సౌదామినిని త్రోసి రాజని అహల్య కావాలంటున్నట్లున్నాడు! కుమార్ సౌదామినికోసం పడరానిపాట్లు పడ్డట్లుంది. ఆమె వెంట తిర గటం—ఆమె కనుకొలకుల్లోంచి వచ్చే చూపులకోసం మధన పడటం సాగించేవాడిలా అతన్ని తనే నాథో అర్థం చేసు కున్నాడు. అనవసరమైన త్యాగాలు—తద్వారా విపరీతమైన మానసిక సంక్షోభము యెందుకని తను వెంటనే అహల్య వివాహ సమస్య పరిష్కరించాలనుకొని నర్సరావుపేట వెళ్లాడు. ఫలితంగా రామకృష్ణే కుమార్ అయి కూర్చున్నాడు! కుమార్ అహల్యల వివాహం కుదురుతుందా? సూర్యం ప్రేమ మాటేమిటి? సౌదామినీ అహల్యల ఆలోచనా గతులేలా వున్నవి?...ఏమిటిది? ఏవో నవలల్లో మాదిరిగా వాస్తవిక జీవితంలో సంఘటనలు జరగటం ఆశ్చర్యపరచింది రచయిత అయిన రాజారావును.

కుమార్ కూడా ఆలోచిస్తున్నాడు—తన తండ్రి చెవినబడనీకుండా బావగారి సహాయంవల్ల తన జబ్బు నయం చేసుకునేందుకు దొరికిన మార్గమా యిది అని భావించాడు. కాని...వెంటనే బావకు యదార్థమంతా తెలుస్తే అతని యెదుట తను తల యెత్తుకొని తిరిగేదేలాయని సంకోచ పడ్డాడు.

రిక్షాలు ఆగాయి. ఇద్దరూ దిగి యింటిలో అడుగు బెట్టారు.

# పదవ ప్రకరణము

---

గదిలో అడుగు పెడుతూనే కాంచిన దృశ్యం రాజారావుని అమితాశ్చర్య పరచింది! డ్రాయింగ్ రూమ్‌గా వాడు కుంటున్న తన గదిలో చాపమీద పడుకొని యేదో పుస్తకం చదువుకుంటున్నాడు సూర్యం! అనాలోచితంగా అతను తన యింటికి రావటం, అందులోను యీ సమయంలో— కొంచం విసుగునే కలుగజేసింది రాజారావుకి. అయినా చిరు దగ్గొకటి దగ్గి "హలో... సూర్యం!" అన్నాడు.

సూర్యం లేచి కూర్చున్నాడు. రాజారావు ప్రక్కనే మునుపటి హుందాతనం, వుత్సాహం లేకుండా బితుకు బితుకుగా చూచే కుమార్‌ను చూచి సూర్యంకూడ విస్తుపోయాడు! 'ఇదేమిటి?' కుమార్‌కి రాజారావుకు యెప్పటినుంచి మిత్రత్వం?' అనుకున్నాడు మనసులోనే.

"మా బావమరది రామకృష్ణ కుమార్!" రాజారావు కుమార్‌ని సూర్యాని పరిచయం చేశాడు.

"సూర్యనారాయణ! నారాయణరావుగారికి దగ్గర బంధువూ అవ్వుడుకూడాను." కుమార్‌కు కూడా సూర్యాన్ని పరిచయం చేశాడు రాజారావు.

కుమార్ సూర్యాలిద్దరూ ముఖాలమీదికి చిరునవ్వులు తెచ్చుకొని పరస్పర నమస్కారాలు చేసుకున్నారు. వారిద్దరిలోను యే ఒకరూ వారి కలయికను హర్షించలేనట్టు రాజారావువారి ధోరణినిబట్టి సులభంగానే వూహించగలిగాడు!

"రెండు ఓవల్టిన్!" అన్నాడు సూర్యం.

"కాదు- ఒక ఓవల్టీన్, ఒక కాఫీ." రాజారావు సవరించాడు.

"అలా చల్లగాలి కెళ్దామా!" అన్నాడు రాజారావు కాఫీ ముగించి సూర్యనారాయణవైపుకు పరిశీలనగా చూస్తూ.

సూర్యనారాయణ సూటిగా రాజారావువైపు చూడలేకపోతున్నాడు. తల వంచుకునే అంగీకారసూచకంగా తలూపాడు. రాజారావు ముఖంవైపు చూచేందుకతడు మహా బిడియపడుతున్నవాడిలా కనుపించాడు.

రైలు వంతెన దాటి కాళేశ్వర్రావు మార్కెట్టుగుండా నడక సాగించారిద్దరూ. మెర్కురీ లైట్లతో మిలమిలా మెరిశే వెండిబంగారాల ఆభరణాల కొట్లుదాటి దుర్గగుడివైపుకు పయనం సాగించారు. కొండమెట్లు కొద్దిదూరం మాత్రమే ఎక్కి తర్వాత మరోవైపుకెళ్లి కొద్దిదూరంలో ఒక పెద్ద బండ రాయిమీదకూర్చున్నారిద్దరూ.అక్కడనుంచి విజయవాడపట్టణమంతా వింతసొబగులతో కనిపిస్తోంది.సినిమాహాళ్ళమీద వెలిగే లైట్ల కాంతి చుట్టుప్రక్కలంతా కాంతిపుంజాల్ని విరజిమ్ముతున్నది. పట్టణంలోనుంచి వెలువడే నిస్వనాలు ఆ దూరానికి వింతగా వినిపిస్తున్నవి. తప్పుచేసిన మొద్దబ్బాయిలా తలవంచుకొని కూర్చున్నాడు సూర్యనారాయణ! రాజారావునుంచి యేలాంటి ప్రశ్న పరంపరవస్తుందోనని కలవరపడుతున్నట్టున్నాడు. రాజారావు తీక్ష్ణబుద్ధి వాదనాబలం తన భావాలని తికమక పర్చవచ్చునేమోనని భయపడుతున్నట్టున్నాడు.

"సూర్యం!" కడపటి దమ్ము సిగరెట్ పీల్చి పీక విసిరి వేస్తూ మృదువుగా పిలిచాడు రాజారావు.

సూర్యం రాజారావు వైపు చూచి తిరిగి తలవంచుకున్నాడు.

"సూర్యం! నీ మనోగతభావాన్ని పూర్తిగా గాకున్నా చాలవరకు అర్థం చేసుకున్నాననే నేననుకుంటూవున్నాను... నీవే ఆలోచించు! తాపీగా ఆలోచించు! తొందరపడమాక! మానవ మనస్తత్వాలు ఆలోచనావిధానంలో పూర్తిగా మారాలి సూర్యం! ఏవేవో వున్నత భావాలు, గొప్ప ఆశయాలు వూహించుకుంటూ వర్ణించుకుంటూ కూర్చునే మనబోటి వాళ్ళమైనా నూతన రీతుల్లో ఆలోచించడమనేది అలవరచుకోవాలి!" అన్నాడు రాజారావు.

రాజారావు మాటలు అతి సున్నితంగాను, మృదుమధురంగాను వున్నాయి. అతని కళ్లలో జాలి, సానుభూతి తొణికిసలాడుతున్నవి.

సూర్యనారాయణ రాజారావు వంక ఒక క్షణం చూచి తిరిగి తలవంచుకున్నాడు. రాజారావు మాటల్లోని ప్రేమసౌహార్ద్రాలు అతణ్ని విచలితుణ్ణి చేశాయి. "నేను మా సొంత ఊరికి పోవాలనుకుంటున్నాను!" హటాత్తుగా అనేశాడు.

సూర్యం మాటలు విన్న రాజారావు వదనంపైన వింత దరహాసం వెలువడింది. క్రింద పెదవిని మునుపంటితో కొద్దిగా కొరుకుతూ మెల్లగా నవ్వుకున్నాడు.

తనన్న ఆ రెండు మాటల ప్రభావం రాజారావుపైన

యెంతగానో పనిచేస్తవని ముందుగానే వూహించుకున్న సూర్య నారాయణకు రాజారావు మౌనము దుస్సహంగా తోచింది.

"అవును. నేను వూరికి వెళ్లిపోవాలని...శాశ్వతంగా యీ పరిసరాలను వదిలేసి వెళ్ళాలని నిశ్చయించుకున్నాను," అన్నాడు తిరిగి దృఢంగా.

"ఆ..." వూకొట్టాడు సూర్యం మాటలకు జవాబుగా రాజారావు.

అంతే!

సూర్యం విస్తుపోయాడు ముందు. ఆ దిగ్భ్రాంతి తీవ్ర మైన కోపాన్నే తెప్పించింది అతనికి. 'వెళ్ళిపోతానంటే'నచ్చే జవాబు వేరుగా వుంటుందనుకున్నాడు. కాని...తన నమ్మకం వమ్మయిపోయింది. అంతవరకు రాజారావు జవాబుకోసం హృదయాన్నంతా గుప్పిట్లో పెట్టుకొని కూర్చున్నవాడల్లా తలయెత్తి రాజారావువైపు తీక్షణంగా చూశాడు. ఆ కళ్లు చింతనిప్పుల్లా కణకణలాడాయి. మనిషి అదిరి పడుతున్నాడు. విసురుగా లేచి "థ్యాంక్సు" అంటూ చరచరా వెళ్ళిపోయాడు.

విసురుగా వెళ్ళిపోతూవున్న సూర్యాన్ని కళ్ళప్పగించి చూస్తూ కూర్చున్నాడు రాజారావు. అతని ముఖంమీద వెలువడ్డ దరహాసంలో యేయే భావాలున్నవో పూర్తిగా కనుక్కోటం మహా కష్టమేనయినా సానుభూతి, ఆవేదన కావలసినంత వున్నవని కనుక్కోటం కష్టమేమీ గాదు.

* * *

'చేసిన తప్పుల్ని పొరబాట్లని సరిదిద్దుకునేందుకు మానవుల కవకాశమే యివ్వదా సమాజం? కాకుంటే యేమిటిది?—'

సౌదామిని వంటరిగా పడకగదిలో కూర్చుని ఆలోచిస్తోంది. సూర్యం తన యింట్లో అడుగుబెట్టి నప్పటినుంచి యిప్పుడు తన్ను వశపరచుకున్న విజ్ఞానమే వుండి వుంటే యెంత బావుం డేది! అప్పుడొకవేళ – అతడు తన్ను ప్రేమించినా ప్రేమిం చక పోయినా తను బాధ పడవలసిన అవసరం వుండేదిగాదు. ఎందుకంటే – అప్పుడు తనవల్లనే, తన పొరబాట్లవల్లనే సక్రమంగా జరుగలేదు అనే బాధ వుండేదిగాదు. సౌదామిని విశాలనయనాల్లో కన్నీరు గ్రమ్ముకుంది. నాన్న ఆనకట్ట పనిలో సతమత మవుతున్నాడు. నారాయణరావుగారిని తలచుకొని నవ్వుకుంది సౌదామిని. సంపాదనమీాద అంత ప్రేమ యెందుకో! కావలసినంత కంటే మిన్నగానే సిరి సంపదలున్నాయి. ఆయన సంధ్యా సమయంలో వున్నారు. అయినా అనిరతమూా శ్రమపడుతూనే వుంటారు! తను ఒకటి రెండుసార్లు అదే మాట అందికూడా. కాని రావుగారు మెల్లగా నవ్వి మీాసాలు సవరించుకున్నారు జవాబుగా. అంతే!

ప్రత్యేకించి రెండు మూడు దినాలనుండి సూర్యనారా యణ ప్రవర్తన సౌదామిని కాశ్చర్యం కల్గించింది! అతని పిచ్చి వాలకమూా, ఎడతెగని ఆలోచనలు – ఎక్కడెక్కడో తిరు గుతూ వుండటము – పరధ్యానము గమనిస్తూనే వుంది. కార ణాన్ని వూహించేందుకుకూడా వృధాశ్రమపడింది కూడా. ఎన్నెన్నో వూహాలహరులామె యెదలో సూర్యనారాయణ్ణి గురించి యిట్టే వుదయించి వెంటనే మాయమయ్యేవి. ఒక దాని కొకటి పోలికా పొంతనా వుండేదిగాదు. అంతా గందర గోళంగా అవుపించేది.

ఇంతలోనే ఎదురుగావున్న సూర్యనారాయణ గది తలుపు తెరచిన శబ్దం వినవచ్చింది. ఆమె ఆ గదివైపు చూచే సరికి అప్పుడే వెలిగిన లైటు కాంతిలో సూర్యనారాయణ స్పష్టంగా అవుపించాడు. మాసిన షర్టు, చిందర వందరగానున్న వెంట్రుకలు, పీక్కుపోయినట్లున్న ముఖం – ఇదీ అతని వాలకం!

సౌదామిని క్షణంలో యేదో నిర్ణయానికి వచ్చిన దానిలా అవుపించింది. మెల్లగా లేచి సూర్యనారాయణ గది వైపు నడచి ఆ గదిలో అడుగు బెట్టింది. పెట్టెలోని గుడ్డల్ని సర్దుతున్న సూర్యం అలికిడి విని తలెత్తి తలుపువైపు చూచాడు. తలుపు వద్దే నిలుచుండి నిర్నిమేషంగా తనవైపే చూస్తూన్న సౌదామినిని చూచి లేచి నిలుచుండి "కూర్చోండి!" అన్నాడు మర్యాద లాంఛనంగా.

సౌదామిని ఆలాగే నిల్చుంది.

కూర్చోలేదు.

ఆమె కళ్లలో నీరు గిర్రున తిరిగింది.

సౌదామిని కన్నీటినిచూచిన సూర్యం గాభరాపడ్డాడు. కారణాన్ని యేలా అడిగి తెలుసుకోవటమాయని తికమక పడ్డాడు.

గాంధీనగర్‌లోని బ్యాంకులో తొమ్మిది గంటలు కొట్టినట్టు విస్పష్టంగా వినిపించింది.

ఒకటి...రెండు...మూడు.....అయిదు నిముషాలు గడచాయి.

కాలచక్రం బరువుగా తిరుగుతున్నట్లోంది. ప్రతి క్షణమూ యెంతో కాలాన్ని తన పొట్టన పెట్టుకున్నట్టుంది.

సూర్యం మెల్లగా అడుగులు ఎంచి వేస్తున్నట్టు సౌదామిని వైపు నడిచాడు. "సౌదామినీ! ఏమిటిది?" అన్నాడు. అతని కంఠంలోని జీర కిర్రుమంది. అతి సున్నితమైన ఆతని హృదయంకూడ యెంతో బాధపడింది. కళ్లలో నీరు తిరగకుండా ప్రయత్నంమీద ఆపుకున్నాడు.

సౌదామిని జవాబివ్వలేదు. మృదువుగా సూర్యనారాయణ ప్రశ్నించటం నిండుకుండలాంటి మేఘ శకలానికి చల్లగాలి సోకినట్టయింది. ఆమె కళ్లలోనుండి కన్నీరు జల జలా రాలింది.

"సౌదామినీ!..." సూర్యం తిరిగి ఆమెను పిలిచాడు.

"నే నేనాడో పశ్చాత్తాపం చెంది క్షమాభిక్ష కోరినా...మీరు..." మరింక మాట్లాడలేక ఆగిపోయింది సౌదామిని.

సూర్యనారాయణ సౌదామిని వైపు ఆశ్చర్యంగా చూచాడు. "నేనేం చేశాను?" అమాయకంగా ప్రశ్నించాడు. అంత దుఃఖంలో వున్న సౌదామినికా ప్రశ్న చిన్న కుర్రాణ్ణి పెద్దలెవరైనా గద్దిస్తే యిచ్చే జవాబులా విన్పించింది!

"మీరెందుకని సరిగా భోజనం చేయటం లేదు? మీ బట్టలు - మీ వేషమూ ఓ మారు అద్దంలో చూచుకోండి! ఈ శిక్ష ఎవరికోసం?" గబ గబా ప్రశ్నించింది సౌదామిని కన్నీటితోనే.

సూర్యనారాయణ తల దించేసుకున్నాడు. "ఒకరి కోసం శిక్ష విధించుకునేపాటివాడినిగూడా గాదు నే నసలు! శిక్ష ఎవరికోసమూ కాదు. నా మీద నాకే కసి!...నా జీవితమే యింత! నే నెక్కడవున్నా నాకే గాకుండా నా చుట్టూ వున్నవారికికూడ మనశ్శాంతి వుండదు! నేను మా వూరు పోవాలనుకుంటున్నాను - ఈ రాత్రి బండికే!" అనేశాడు.

"ఆ..." ఆశ్చర్యంగా నోరు తెరువబోయింది సౌదామిని. అంతలోనే ఏడుకొండలు మెట్లన్నీ నడచిన ఒగిరింపుతో ఆయాసపడుతూ పరుగెత్తుకుంటూ వచ్చి "అమ్మా! టెలిగ్రామ్!" అంటూ టెలిగ్రామును సౌదామిని చేతిలో బెట్టాడు. సూర్యనారాయణ కెందుకో గుండెలు వేగంగా కొట్టుకున్నవి. టెలిగ్రాం కవరు చించేముందు సౌదామిని సూర్యనారాయణ వైపు చూచింది. సూర్యనారాయణగూడ టెలిగ్రామ్‌మీదనే దృష్టి నిలపటంవల్ల వారి నాల్గు కళ్లు ఒక్కమాటు కలుసుకున్నవి. వారి కళ్లలో కన్నీరు గాంచిన యేడుకొండలు బయటకు తప్పుకున్నాడు. టెలిగ్రామ్ చదివిన సౌదామిని పెద్ద కేక బెట్టి పడిపోబోయింది. కాని సూర్యనారాయణ ఆమె క్రింద బడకుండా తన రెండు చేతులతోను ఆమెను తన చేతుల్లోకి తీసుకొని యేడుకొండల్ని చల్లనీటికోసం కేకవేసి తన మంచం మీద ఆమెను పరుండబెట్టాడు.

## పదకొండవ ప్రకరణము

---

"ఫాదర్ సీరియస్‌లీ వూండెడ్...స్టార్ట్ ఇమిడియెట్లీ."

టెలిగ్రామ్ కాగితాన్ని చదువుతూ వుంటే సూర్య

నారాయణ చేతులు వణికాయి. ఆ ఒక్క క్షణంలోనే ఎన్నో భావాలతన్ని ముమ్మరంగా పెనవేసుకున్నట్లు అనిపించింది. పని మనిషి సౌదామిని ముఖంమీద చల్లటినీళ్ళు చిలుకరించి విసన కర్రతో విసురుతోంది. సూర్యానికేమీ దిక్కుతోచలేదు. ఏడుకొండల్ని పిలిచి రాజారావును రమ్మని కబురంపాడు. డాక్టర్ వనజాక్షికి ఫోను చేశాడు. పది నిముషాలకల్లా డాక్టర్ గదిలో ప్రవేశించటమూ, సౌదామిని కళ్ళు తెరవ టమూ రెండూ ఒకేమారు జరిగాయి. "పదండి వెళ్దాం!" హీనస్వరంతో అంటూ లేచి కూర్చుంది సౌదామిని. డాక్టర్ పరీక్షించి మరేం ప్రమాదం లేదని భరవసా యిచ్చింది. అంత లోనే రాజారావుకూడ వచ్చేశాడు. ఏడుకొండలకు, పనిమని షికి యింటి నప్పగించి ముగ్గురూ కారు ఎక్కారు. స్పీడా మీటర్ నలభైవ మైలు చూపుతోంటే కారు గుంటూరు రోడ్డుకేసి దూసుకెళ్ళింది.

*

ప్రాజెక్టు పని చక చకా సాగిపోతోంది. అది కండిష నల్ కాంట్రాక్టు. నాలుగోవంతు పని మూడు మాసాల్లోగా జరిగిపోవాలి. ఆ పని పూర్తవుతేనే 'పార్టు పేమెంట్'గా బిల్లు చేతికి వస్తుంది. అందులోను కేంద్రమంత్రి యెవరో వస్తున్నారని త్వరగా పూర్తిచేయాలని ప్రభుత్వాధికారులు వత్తిడిపెడుతున్నారు. నిర్మాణ దశలోనున్న ఆ ప్రాజెక్టు పనిని చూస్తేనేగాని మంత్రిగారు కేంద్ర ప్రభుత్వ సహాయానికి 'రెకమెండ్' చేయరు.

రావుగారు నాలుగు వందల కూలీల్ను పెట్టి షిఫ్టు

పద్ధతిని రాత్రింబవళ్ళు పనిచేయిస్తున్నారు. మేస్త్రీలమీదనే భారంవేయక తనే స్వయాన నిలబడి ప్రతి చిన్నపనినీ పరిశీలిస్తున్నారు. ఆ ధోరణే ఆయనను పేరొందిన కంట్రాక్టర్లలో ఒకరిగా తయారుచేసింది. మందుపెట్టి ఒకచోట బండరాయిని పగులకొట్టు ప్రయత్నంలో రావుగారికి పెద్ద దెబ్బ తగిలింది. వెంటనే 'అంబులెన్సు' కారులో గుంటూరు జనరల్ హాస్పిటల్‌కు తీసుకు వెళ్లారాయనను. వెంటనే విజయవాడకు టెలిగ్రామ్ యిచ్చారు.

రావుగారి సిరిసంపదలు, పలుకుబడి- పరివారము యేవీ ఆయనను కాపాడలేకపోయాయి. సిద్ధహస్తులని పేరొందిన డాక్టర్ల కృషికూడ విఫలమయింది. ఆయనకు దెబ్బ తగిలినప్పుడు స్పృహపోయింది. తిరిగి స్పృహనుకూడ తెప్పించలేకపోయారు. సౌదామినీ ప్రభృతులు గుంటూరు చేరుకునే లోగానే ఆయన ప్రాణవాయువులు అనంత వాయువుల్లో లీనమయినవి. సౌదామిని తన తండ్రి లేడనే వార్త విన్న వెంటనే నిర్విణ్ణురాలై పోయింది. ఏడ్చేందుకుకూడా ఆమెకు కన్నీళ్ళు మిగులలేదు. దారివెంట ధారాపాతంగా స్రవించిన కన్నీరు మరింక రాలేదు; ఇంకిపోయింది. పిచ్చిపట్టినదానిలా రావుగారి శవానికేసి అలాగే చూస్తూ నిలుచుండిపోయింది.

సౌదామిని పిచ్చివాలకాన్ని చూచిన చుట్టూవున్న వారంతా గాభరాపడిపోయారు. సూర్యనారాయణ సౌదామిని భుజంమీద చేయివేసి లాలనగా "సౌదామినీ!..." అని ఏదో మాట్లాడబోయాడు. కాని అతని రుద్ధకంఠంలోనుంచి మాటలు పెకిలిరాలేదు. రాజారావు అదంతా గమనిస్తూనే

ఉన్నాడు. అందరిలోను కర్తవ్య పాలనని గురించి ఆలోచించ గల స్థితిలో నున్నది అతడొక్కడే!

రాజారావు సూర్యాన్ని ప్రక్కకు పిలిచాడు. అతని కళ్లనిండుగా గ్రమ్ముకున్న కన్నీటిని చూస్తూ "ఏమిటీ బేల తనం సూర్యం! ప్రాణికి మరణం అనే పదం జీవితంతో పాటే పుట్టిందిగదూ! క్రొత్తదేం కాదుగా......ముందు కర్తవ్యం చూడాలి మరి. సౌదామిని యిక్కడ తన తండ్రి శవం ఎదుట మరికొంతసేపైనా వుండటం మంచిదిగాదు. ఆమెను వేరే గదిలోకి తీసుకెళ్ళు. రావుగారి ఒక్కగానొక్క బిడ్డ సౌదామిని! సర్వప్రాణాలు ఆమెమీదే వుంచి పెంచారాయన. ఎంతో గారాబంగా పెరిగిన ఆమెకు మరింక తన కాత్మీయులు లేరని భావించుకునే పరిస్థితి వస్తే విషాద పరిణామాలకు దారి తీయవచ్చు. అలా భావించకుండా ఆమెకు అసట యివ్వవల సిన వాడివి నీ వొక్కడివే!

"అదే రావుగారి అభిమతం కూడాను. ఏ కోణంలో నుంచి ఆలోచించినా యీ విషమ పరిస్థితిలో అదే నీ కర్తవ్యంగూడ. ఊ...పద. ఆమెను తీసుకెళ్ళు." కర్తవ్య బోధనతో పాటు ఆజ్ఞ యిచ్చినట్టుగా కూడా గంభీరంగా వెలువడ్డాయి రాజారావునుంచి ఆ మాటలు.

రాజారావు పలుకులకు జవాబిచ్చే దశలో లేడు సూర్యనారాయణ. తల వంచుకునే గంగిరెద్దులా తలూపాడు. దాదాపు మరో ప్రపంచంలో వున్నట్టుగా, మగతగా వున్న సౌదామిని రెండు చేతులు పట్టుకొని గది వెలుపలికి తీసు

కెళ్ళాడు. దుఃఖభారంతో క్రుంగిపోతూ వున్న సౌదామిని చిన్న పిల్లలా అతని వెంట నడిచింది.

రావుగారి మృతశరీరాన్ని చూస్తోంటే రాజారావు హృదయంలో యేవేవో నూతన భావాలు తొంగిచూస్తూ న్నవి. ఎవరైనా ఆప్తులైనవారు మరణించినప్పుడు మనకు కలిగే భావాలు స్మశాన వైరాగ్యం అని అంటుంటారు ప్రజలు! మానవుడిలోని మరచిపోయిన తాత్విక చింతనను రేకెత్తించే సమయమది! విషాదభరితమైన హృదయం మామూ లుకు భిన్నంగా సరిక్రొత్తగా ఆలోచిస్తుంది! లౌకిక జీవితం మీద విరక్తి మానవతకు లొంగని అలౌకిక శక్తియైన మరణం మనలో కలిగిస్తుంది.

అవును. రావుగారి జీవితమంతా తనెరుగును. ప్రపం చంలో ఆయన తన పాత్రను బహు చాకచక్యంగా నిర్వర్తిం చిన మహా నటులు! స్వశక్తితో లక్షల ధనము, అపూర్వమైన గౌరవ మర్యాదలు సంపాదించారు. ధనవంతులలో పేద వారుగా పేదవారిలో ధనవంతులుగా మెసలుకున్నారు. శాశ్వ తంగా కన్నుమూసేవరకు సంపాదనమీద దృష్టి నిలిపారు - కాని...ఆయన నేడు తనవెంట తీసుక వెళుతున్న దేమిటి?ఏమీ లేదు. ప్రపంచం - చావూ - పుట్టుకా - మమతా మమ కారాలు - కరుణా కార్పణ్యాలు-యివన్నీ యేమిటి? మానవ జీవితం ప్రకృతిమీద యెన్నో విజయాల్ని సాధించి నాగరికతా పతాకను ఎవరెస్టు శిఖరంమీద ప్రతిష్టించింది. కాని జవాబు లేని ప్రశ్నలుగానే జీవితంలో చావు పుట్టుకలు నిలిచాయి! బుద్ధుడు, జీసస్‌లాంటి మహాపురుషులు యెందరో తాత్విక

వే_త్తలు చావును జయించాలని ప్రయత్నించారు. ప్రపంచంలో - దేశ దేశాల యెందరో మహాత్ములు, వేదాంతులు యేవేవో మార్గాల్ను రీతుల్ను ఆలోచించారు. సైన్సు నిర్వి రామంగా కృషి చేస్తోంది! కని విని యెరుగని వింతలను మానవుడు తన పిడికిళ్లలోకి తెచ్చుకొని శాసన కర్తగా మారి పోతున్నాడు. కాని...ప్రపంచంలో యీ చావు అనే పదం యెందుకు నశించదు? ఆలోచిస్తున్నాడు రాజారావు. ప్రాణి కోటి మరణం బారినుంచి తప్పించుకున్నట్లయితే ప్రపంచ మేలా వుంటుంది? ఊహించుకోబోయాడతను.ఆ వూహాచిత్రణ కూడా యేమంత రసవత్తరంగా అవుపించ లేదు. ఆలోచించిన కొద్ది అగాధమయ్యే విషయాలివి! తనిప్పుడు వూహించిన ఊహా చిత్రణే నిజమైతే ప్రపంచం మరింతగా సంతుబితమై పోతుం దేమో! ఎంగిలి విస్తరిచుట్టూ మూగిన కుక్కల్లా మానవులు కాట్లాడుకోక తప్పదేమో! కాబట్టి జనన మరణాల చక్రం యీలాగే పరిభ్రమించటం మంచిదేమో!

ఆలా ఊహించిన రాజారావుకి వెంటనే తన వూహ తప్పేమోనని వెంటనే తోచింది. ఆలా యెందుకని అను కోవాలి? మరణం ఆగిపోతే జనసంఖ్య విపరీతమే కావచ్చు! అయినా అందుకు తగ్గ అవకాశాలకోసం అవసరాల సృష్టి కోసం యెందుకని పరిశోధనలు జరుగకూడదు? భూమేగాకుండా యితర గ్రహాల్నికూడ మానవుడు అప్పుడు తన అదుపులోకి తెచ్చుకోగలడేమో!

ఆ సమస్యమీద రాజారావు మరింక ఆలోచించ లేక పోయాడు. కనీసం ఆలోచించేందుకుకూడ అశక్తుడ్ని

తెలుసుకొని తన విజ్ఞానపు పరిధి యెంత సంకుచితమైందోనని తనలో తనే కొద్దిగా సిగ్గుపడ్డాడు కూడా.

దుఃఖోద్వేగంతో ప్రపంచాన్నే మరచిపోయి మరణిం చిన పితృమూర్తినే కలవరిస్తూ నేల కరచుకపోయిన సౌదా మిని, పరిస్థితుల పరిణామానికి విస్తుపోతూ తికమకలాడిపోతూ సౌదామినిని ఊరడించే సూర్యనారాయణ కర్తవ్యతావిమూఢు లయ్యారు. రాజారావే అన్నింటికి పూనుకున్నాడు. రావుగారి వంక చుట్టాలమని బోలెడంతమంది బంధువర్గం మూగినా రాజారావు మూర్తి, అతని తీక్షణ దృక్కులు, వారిని చొరవ చేసుకొనేందుకుగాని, అంతా తామే అన్నట్లు వ్యవహరించేం దుకుగాని వీలు కలుగజేయనీక పోయినవి. రావుగారి కర్మ కాండ నిర్వహణ నిర్విఘ్నంగా జరిగిపోయింది. మూగిన బంధు వులు యెవరిదారంట వారు వెళ్ళిపోయినారు.

అనితరమూ పరిభ్రమించే కాలచక్రం మనుష్యుల కష్ట సుఖాల్నిగాని యిష్టాయిష్టాల్నిగాని ఖాతరుచేస్తుందా? తల వంచుకొని తన నడకేమో తనేమో! ఆనందాలు, విషాదాలు, బాధలు, ప్రేమలు, విరహాలు, నిట్టూర్పులు - ప్రపంచంలో జరిగేవన్నీ - అన్నింటిని మౌనంగా చూస్తూ నిర్లిప్తంగా వెళ్ళి పోతూ వుంటుంది కాలం!

రావుగారు మరణించి అప్పుడే పక్షం రోజులు గడ చాయి. తండ్రి మరణాన్ని కన్నారా చూస్తూనే యే క్షణా న్నయినా తన గుండెకూడ హఠాత్తుగా ఆగిపోవటం సంభ వించవచ్చునని ఆశించిన సౌదామిని పూర్తిగా గాకున్నా తిరిగి తన దైనందిన జీవితవ్యవహార సరళిలో పడిపోప్రారంభించింది!

సూర్యం మనస్సు చల్లారిపోయిన కుంపటిలా, లావా ప్రవాహాన్ని విరజిమ్మి ఆరిపోయిన అగ్నిపర్వతంలా వుంది! ఆ పదిహేను రోజులకు పదిహేనేళ్ల జీవితం గడిపినవాడిలా తయారయ్యాడు. అతని మానసిక స్థితి అతనికే అర్థం కావటం లేదు! అయోమయావస్థలో ఒంటరిగా యెడారిలో పయనం చేస్తున్న పాంథుడిలా 'ఫీ'లవుతున్నాడు.

ఎటొచ్చి నిండుకుండలా తొణకకుండా అన్ని వ్యవహారాల్ని చక్కబెట్టున్నది రాజారావు ఒక్కడే! అతడే కలుగజేసుకోకపోతే ఆ కుటుంబ పరిస్థితు లేలావుండేవో!

రావుగారు మధ్యలో దిగవిడచిపోయిన ప్రాజెక్టు పని తిరిగి చురుగ్గా జరిగిపోతోంది. రావుగారి మూర్తి మాత్రమే అదృశ్యమైందిగాని ఆయనకు సంబంధించిన పనులన్నీ యథావిధిగా జరిగిపోతూ వున్నట్లు అందరూ తెలుసుకునేందుకు యెంతోకాలం పట్టలేదు!

## పంద్రెండవ ప్రకరణము

"సూర్యం!"

"..............."

"సూర్యం!"

దంతెలకు కళ్లప్పగించి దీర్ఘాలోచనలో పడియున్న సూర్యనారాయణ రాజారావు పిలుపుకు వులిక్కిపడినాడు. లేచి కూర్చుంటూ మౌనంగానే రాజారావుకు ఆసనం చూపించి కూర్చోమన్నాడు.

రాజారావు కూర్చుని నింపాదిగా సిగరెట్ అంటిం చాడు. సూర్యం తల వంచుకొని కూర్చునే అప్పుడప్పుడు రాజారావు కేసి దృష్టి సారిస్తున్నాడు.

వారిద్దరి హృదయాల్లోలానే గదిలోకూడ నిశ్శబ్దత గంభీరతను పులుముకొని వింతగా నడయాడుతోంది.

"సూర్యం...!" రాజారావు నిశ్శబ్దాన్ని భంగపర చాడు. సూర్యం తల యెత్తకుండానే బరువుగా కనురెప్ప లెత్తి రాజారావువైపు చూచాడు జవాబుగా.

"సూర్యం! బేలపడిపోతున్నావా? నీవేకాదు. ఇలాంటి పరిస్థితులు యెదురైనప్పుడు అందరూ అలానే బేలపడుతూనే వుంటారు. ఆ బలహీనతకు ఆసరాగా వేదాంత ధోరణి నొక దాన్ని యెరువు తెచ్చుకుంటారుకూడ. క్రుళ్ళిన వస్తువును బజారువెంట తీసుకెళ్తూంటే గప్పుమని దుర్గంధం మన నాసికా పుటాల్ని ఆక్రమించేది ఆ కొద్దికాలం మాత్రమే! కాని అదే శాశ్వతంగా వుంటుందా? బలహీనతతో మనోస్థయిర్యాన్ని గోల్పోయినప్పుడు మన హృదయాల్ని ఆక్రమించే యీ వేదాంతపు తీరుకూడ అంతే! ఎదురైన సమస్యల్ని ధైర్యంగా పరిష్కరించుకోవాలిగాని ఆలోచిస్తూ కూర్చుంటే ఆ ముళ్లు మరీ బిగుసుకపోతవి..." ఆగాడు రాజారావు.

సూర్యం బదులేమీ పలుకలేదు. మౌనంగా వింటూ కూర్చున్నాడు.

"ఈ యింటి నావరించిన నిస్తబ్దత అంతరించాలంటే ఒకటే మార్గం! అదేం క్రొత్తదికాదుకూడ! నీవుకూడ సుల భంగా వూహించవచ్చు. మరణించిన రావుగారి వూహాలకు

స్వరూపమివ్వాలి. ఆయన ఆశయాన్ని అమలు జరపాలి!'' అన్నాడు రాజారావు ఒక్కొక్కమాట ఒత్తి పలుకుతూ.

''రాజారావుగారూ!'' రాజారావుని అలా పేరుతో సంబోధించటం సూర్యానికదే మొదలేమో! అతడు వ్యధతో పూర్తిగా పీడింపబడేవానిలా అన్నాడు. ''...అయితే జీవితానికి వ్యక్తిత్వమంటూ లేకుండా పరిస్థితులనే యంత్రంలో ఒక మరగా మారమనేనా మీరు చెప్పేది?...'' కొద్దిసేపాగి తిరిగి అన్నాడు సూర్యనారాయణ. ''...నేనూ మనిషిని - రక్తమాంసాలున్న మనిషిని. ఆశయాలు - ఆలోచనలు నాకు వుంటవనేది మరచిపోకండి! నా భావి జీవిత పథాన్ని నిర్ణయించుకోవలసిన బాధ్యత సంపూర్తిగా నాదే. ఆ బాధ్యతని వదులుకొని పరాయివాళ్ళకప్పగించి కేవలం ఒక బొమ్మగా మాత్రం నేను మనలేను.'' ఆ మాటలు సూర్యనారాయణలో నుంచి మెల్లగానే వెలువడినా తీవ్రత పూర్తిగా ధ్వనించింది.

సూర్యం వేసిన సూటిప్రశ్న రాజారావు హృదయాన్ని ఢీకొనింది. క్రొత్తగా చూస్తున్నవాడిలా సూర్యనారాయణ వైపు విస్ఫారిత నయనాలతో చూచాడతను. దీనంగా తనవైపే చూస్తున్న సూర్యం కళ్లలో దీనత్వం, విజేత చేతుల్లో బందీగా దొరికిన వీరుడైన పరాజితుని అశక్తతతో కూడిన అరుణరేఖ అతని కళ్లలో అవుపించింది. రాజారావు మనస్సు 'కలుక్కు' మని బాధ పడినట్లయింది. సూర్యం మీదనుంచి హటాత్తుగా చూపు మరలించి తలవంచుకొనే, మంద్ర స్వరంతో అన్నాడు రాజారావు. ''మానవుడు ఓం ప్రథమంగా భూమిమీద జీవితం సాగించటం ప్రారంభించిన నాటినుంచి

ఏనాడూ స్వతంత్రుడుకాదు. మానవ మాత్రులకు మనం భయపడకపోవచ్చు. కాని...నిర్బంధించి బానిసగా చేసుకొని తన శాసనాల్ని అమలు జరిపించుకునే నియంతలాంటె ప్రకృతి గూడా! ప్రకృతి పరిసరాలు, పరిస్థితులు ఏకమై మనల్ని యిరుకున బెడుతూ వుంటవి. విషయ వాంఛకు, సుఖ జీవితానికి బానిసయ్యే మన శరీర ప్రకృతిగూడ మనకు వ్యతిరేకంగానే పనిచేస్తుంది. వీటన్నింటిని అధిగమించాలని అనుకోవటం మంచిదేనైనా అది అంత సులభమయిన విషయం ఏమీగాదు. అది కంటకావృతమైన యిరుకు బాట! తన చుట్టూ వుండే సమాజాన్ని తన కనుకూలంగా మలచుకోగల శిల్పత్వం, ధీశక్తి ఏ కోటిమంది కొక్కడికి మాత్రమే చాతనైంది. పరిస్థితుల కనుకూలంగా మనల్ని మనమే మలచుకుంటే అంతేచాలు! అదైనా అంత సులువైందేంగాదు సూర్యం! ఎంతో మెలుకువ, నేర్పు అవసరం. అసలు జీవించట మనేదే ఒక కళ! కళా కాదుని ఘోరమైన తపస్సులాంటిదే మానవుని జీవిత పోరాటం కూడా...సూర్యం! లోకమంతా నీవు, సౌదామిని దంపతులనే భావిస్తున్నారు. అందుకే రావుగారి కర్మలకొచ్చిన వారి బంధు సమూహాలుకూడ కిక్కురు మనకుండా వెళ్లిపోయింది! ఈ అనిశ్చిత పరిస్థితి మరెంతోకాలం సాగటం ఎవరికీ మంచిది గాదు. వీలైనంత త్వరలో యీ వివాహం జరగటం వుత్తమమని నా భావన!'' అన్నాడు రాజారావు.

సూర్యం జవాబేమీ యివ్వలేదు. అతని మౌనాన్నే అంగీకారంగా భావించుకున్న రాజారావు ఒక నిట్టూర్పు విడిచి బయటికి నడచాడు. తలయెత్తి సూర్యం నోరు తెరవబోయే

సరికల్లా రాజారావు తలుపు దాటాడు. తలుపు దాటబోతూ రాజారావు, ఆ గది ముందునుంచే గబగబా వెళ్ళిపోతూవున్న సౌదామినిని చూచి నివ్వెర బోయాడు !

సౌదామిని యాదృచ్ఛికంగానే నిస్పృహా గూడు కట్టుకున్నట్లున్న సూర్యం మాటలు విని వారి సంభాషణ పూర్తిగా వినేందుకు ఆ గది ముందే నిలుచుంది. సూర్యనారాయణ మాటల తీరు, రాజారావు వాగ్ధోరణి పూర్తిగా వింది. ఆమెకు తల గిర్రున తిరిగినట్లయింది! రెండు కళ్ళలోనుంచి జలధారలు జాలు వారినవి. పెనుతుఫానుకు నేల నంటుకొని విలవిలా వణికే చిన్న మొక్కలా ఆమె తన గదిలోకి వెళ్ళి మంచంమీద పడుకొని వెక్కి వెక్కి యేడ్చింది. సిగ్గు యెగ్గుల్ని విసర్జించి చేసిన పొరబాటును సవరించుకోవాలని తనంతకు తానే అతని గది కెళ్ళి కన్నీటితో క్షమాభిక్ష కోరినా అతని మనసు కరగ లేదన్న మాట! ఎంత కఠినుడు! తన్ను ప్రేమించలేని అతన్ని కట్టుకొని తను సుఖించేదేమిటి? తన చేతిలోని సంపద ప్రభావంతో అతడు తనకు తాళి కట్టవచ్చు! కాని...నిజమైన ప్రేమను, సుఖాన్ని తను డబ్బుతో కొనగలదా? జీవితాల్లో పొరబాట్లు చేయటం సహజమైన విషయమే. అయినా చేసిన పొరబాట్లను సవరించుకునేందుకుగాని, అధవా సవరించుకున్నా తిరిగి మామూలు జీవిత విధానాన్ని అందరితోపాటు సమానంగా సాగించుకునేందుకుగాని అవకాశ మివ్వదా సమాజం? సామాజిక నిబంధనల్ని తెలిసో తెలియకో ఒకసారి వుల్లంఘించటమంటే శిఖరాగ్రంమీదనుంచి కాలుజారిన విధంగానే వుంటూంటుంది.

నిజమైన నాగరికత, హృదయ వైశాల్యమున్న మానవత్వమూ యీ విధానాన్ని వీలయినంత త్వరలో అరికట్టక పోతే సమాజం మరింత పతనావస్థలోకి దిగజారిపోక తప్పదు. సూర్యనారాయణ అహల్యని ప్రేమిస్తూ వుండటం సౌదామిని యెరుగదు. అందుకే ఆమె భావాలు తన స్వంత పరిధిలోనే విహరించాయి. అందుకే అతని అయిష్టత ఆమెని మరింత క్రుంగదీసింది.

మరునాడు రాజారావు సౌదామినితో సూర్యంతో లానే వివాహ ప్రస్తావన తెచ్చాడు. గడియారంలోని పెండ్యులంలా అటూయిటూ వూగుతూ యే నిర్ణయానికి రాలేక పోతోంది సౌదామిని మనస్సు. అయిదు నిముషాలు మౌనంగా వూరుకుంది. ఆమెతో మాట మాత్రంగా చెప్పటమే చాలని, అంగీకారమంటూ అడుగవలసిన అవసరంకూడ వుండదని, ఆమె సంతోషంగా తల వూస్తుందని ఊహించిన రాజారావు ఆమె మౌనాన్ని చూచి విస్తుపోయాడు.

"...అప్పుడే తొందరేం వచ్చింది? నాన్నగారు వెళ్ళి నెలకూడ తిరుగలేదు!" రావుగారి మాట గుర్తుకు తెచ్చుకున్నందువల్ల ఆమె కంఠం రుద్ధమయింది. మాటలు విషాదంగా వెలువడినవి.

రాజారావు సవిచారంగా తలూపుతూ వివాహం త్వరగా జరగటం యెందుకవసరమో తన భావాన్ని వివరించాడు.

ఆమె జవాబుగా ఒక శుష్కదరహాసాన్ని ప్రదర్శించి "కనీసం మరో రెండు మాసాలు ఆ ప్రస్తావన తేకండి, దయ చేసి..." అంది జాలిగా.

మనుష్యుల మనోగత భావాలు సాగర గర్భంలోని పరిశోధన కందుబాటుకురాని విచిత్ర పదార్థాలుగా వూహించు కున్న రాజారావు ఒక నిట్టూర్పు నిగిడించి ఆమె గదినుండి బయటపడ్డాడు.

అనవసరంగా యీ కుటుంబంలోని చిక్కులతో తను తలబ్రద్దలు చేసుకోవటం అర్థంలేని పెద్దరికాన్ని తలపై పెట్టు కొని సతమత మవ్వటంవల్ల ఏం ప్రయోజనం? దీని పరిణామా లెలా ఉంటాయో! ఏది యేమైనా వీలైనంత తొందరలో యీ బాదరబందీనుంచి తను తప్పుకోవాలి. వీరి సమస్యలూ వర్తులాకారంలో ఉండి, ముగింపంటూ ఉన్నట్టు కనుపిం చదు. అర్థంలేని కావేషాలు, కావాలని క్రొత్త సమస్యల్ని సృష్టించుకోవటం – ఏమిటి వీరి మనస్తత్వం? వీరి సమస్యల కంటే ఉన్నతమైనవి, అత్యవసరమైనవి యెన్నో కార్యవాదుల కోసం కాచుకుని ఉన్నవి అని అనుకున్న రాజారావు యిక ఆ తర్వాత ఆ కుటుంబపు సమస్యల్లో తను యేరకమైన పెద్దరికం వహించకూడదని, నిర్లిప్తంగా తన ఉద్యోగ పరిధిలోనే సంచ రిస్తూ మిగిలిన తన కాలాన్ని సాహిత్య సేవలో సద్వినియోగం చేసుకోవాలనిగూడ గట్టి నిర్ణయానికి వచ్చాడు.

## పదమూడవ ప్రకరణము

ఒకటి...రెండు...మూడు రోజులు బరువుగా గడ చాయి. ఈ మూడు రోజుల్లోను సూర్యం తన గదిలోనుంచి దాదాపు బయటకే రాలేదని చెప్పాలి! రోజుకో మాటు వంట

మనిషి పాటికి పలమారు పిలుస్తే ఫోం చేశేవాడు. గదిలో ఒంటరిగా కూర్చుని తల బ్రద్దలయ్యేలా ఆలోచించేవాడు. ఆలోచన - ఒకటే ఆలోచన! ఆలోచించడానికేముంది? సమస్య చుట్టూ గానుగెద్దులా గిర్రున తిరుగుతూ ఉండేది అతని మనసు. ఒక నిర్ణయానికి వచ్చినట్టే వచ్చి తిరిగి పున రాలోచించుకొని తను చేసుకున్న నిర్ణయం పొరబాటని భావించి తద్విరుద్ధంగా తిరిగి ఆలోచించేవాడు. తిరిగి అంతే! కనీసం మరో రెండు మాసాలైనా వ్యవధి కోరిన సౌదామిని అతనికెంతో ఉపకారం చేసిందని కూడా అనుకున్నాడు!

ఆలోచిస్తున్న సూర్యనారాయణకు హఠాత్తుగా ఒక విషయం గుర్తుకు వచ్చింది.

అహల్యను తను రెండు మూడు సార్లు మాత్రమే దర్శించాడు. ఆ రెండు దఫాలు కూడ ఆమె తన వంక ఒకటి రెండు క్షణికాల పాటే అయినా - విస్ఫారిత నయనాలతో చూశింది. ఆమె చూపుల్లో తనకేదో పెన్నిధి దొరికినట్లు భావించుకున్నాడతను. ప్రథమ వీక్షణంలోనే తన హృదయం ఆమె కంకితమైనట్లు ఆమెలో కూడా అదే భావం యెందు కేర్పడి ఉండగూడదు? ఒక్క మాట - అవును! ఒకే ఒక్క సారి అహల్యతో రెండు నిముషాలపాటు తను ఒంటరిగా మాట్లాడగలుగుతే చాలు ఆమె మనోగత భావాలు తను తెలుసుకోగలడు. కాని, ఎలా? ఆమె నెక్కడ కలుసుకోవాలి? ఏలా కలుసుకోవాలి? ఆలా జరుగుతే, ఆమె అభిప్రాయాన్ని తను తెలుసుకోగలిగితే తర్వాత తన కార్యక్రమాన్ని సుల భంగా నిర్ణయించుకోగలడు. కనీసం కాగితాల ద్వారానైనా